శ్రీరస్తు!

# తిక్కన-మహాభారత రచన



వి. యస్. మూర్తి కవి,
అష్టావధాని.



శ్రీరస్తు

# తిక్కన - మహాభారత రచన

వెలగల వీరారెడ్డిగారికి
(గ్రంథకర్త)
ది. 16-9-64



గ్రంథకర్త:
వెలిది సత్యనారాయణమూర్తికవి,
అష్టావధాని.
నత్తారామేశ్వరం.

B

ప్రథమ ముద్రణ ప్రతులు 1000
శ్రీ క్రోధినామ సం॥రం జ్యేష్ఠం
1964

మూల్యము: రు. 1-50



ముద్రణ :
యు. యస్. ప్రింటింగు వర్క్సు
మార్టేరు.

ఓం

శ్రీ రస్తు.

# ఉపోద్ఘాతము

"విశ్వశ్రేయః కావ్యం". వాక్యమైనను రసాత్మకమగుచో నది కావ్యమగునని పెద్దలనానుడి. ఉక్తి చాతురియు, వాక్చమత్కృతియు, శబ్దమధురిమయుఁ భాషాసౌష్ఠవమునుఁ బోహళించిన కావ్యము సర్వాంగసుందరమై సహృదయ హృదయాహ్లాదమొనఁ గూర్పఁగలదు. అద్ది నీతి ప్రబోధకమైనచో సత్కావ్యమనఁబడును. పాత్రరసములౌచితీ పోషణంబుల విలసిల్లి పరాకాష్ఠనందికొన్న కావ్యము చిన్నదైననుఁ బరితలమానసములఁ జూఱఁగొనుటొక లెక్కలోనిదికాదు.

కవితయందుఁ బ్రతిభగరీమసి. కవులార్ష వైదిక నైతికాది వివిధ కథావస్తువులఁ గవితావస్తువులఁ గాఁగొని వానినిఁ వముప్రతిభచేఁ గళామయంబు లొనరింతురు. గవి బ్రహ్మయందలి ప్రగాఢములగు నాయాదరాభిమానభక్తి విశ్వాసములే నేఁడీ చిన్నికావ్యశశాఖండము నీరూపమున నా సోదరుల కందించుచున్నవి. "పోతన తిక్కనాది కవిపుంగవ లోకము లోకరక్షకుఁడై తగు శౌరికే కృతుల నర్థినిడన్ వలె నన్నమాట సత్యేతరిమానని?" యన్నట్లు తిక్కనామాత్యుఁడు సోమయాజియై రచించిన తన యాంధ్రమహాభారతమును హరిహరనాథున కంకిత మిచ్చితి నన్న దానికం దుభయ కవిమిత్రుఁడు వచించిన హేతువుంగాక నాఁటి దేశకాల పాత్రా

నుసారము చారిత్రక కారణము నీ చిఱుపొత్తము విశదీకరించుచున్నది. "ఆంధ్రకవుల చరిత్ర" గ్రంథకారులగు శ్రీ వీరేశలింగ కవిగారిచ్చిన కథావస్తువునుఁ గావ్యవస్తువుఁగా గ్రహించి యిట్టి రూపమున నాకవితావధూటికిఁ దిలకంబద్ది తదీయ శోభాప్రదీప్తిని దిద్దితీర్ప సమకట్టఁ జేసిన నాప్రయత్న ఫలితమిది. అందెంతవరకు నేను సఫలీకృతుఁడనైతి? నన్నదానిని రసజ్ఞులగు పాఠకులకు విడుచుచున్నాను.

చిన్ననాఁడు మద్గురుపాదులు స్వర్గీయ శ్రీ శతావధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి పాదసేవా భాగ్యవశమున లభించిన వారి నిర్వ్యాజకారుణ్య పీయూషధారాభిషేకమున నా హృత్క్షేత్రమున నిక్షిప్తమైన కవితాబీజముద్దీప్తమై మొలకెత్తి క్రమముగఁ బొటమరించి పూమొగ్గదొడిగి కావ్యకుసుమ సౌరభమునఁ బరితృప్తాంధ్ర హృదయామోదము నీ తెలుంగునఁ బొనఁగూర్పఁగల్గుట మద్భాగధేయ విశేషము. రసహృదయులగు కోవిదులిందలి సత్యార్థమును గ్రహించి తనివిదీర రసమును గ్రోలియానందించుటయే నాపరిశ్రమ కుచిత ఫలితార్థము. రసజ్ఞు లిందలిభ్రమప్రమాద జనితములైన తప్పులను మన్నించి యొప్పుల గ్రహించి యానందింతురుగాక.

ఇట్లు,

గ్రంథకర్త:

నత్తారామేశ్వరం,
క్రోధిసంవత్సరాది.

వెలిది సత్యనారాయణమూర్తికవి
అష్టావధాని.

ఓం

# ఆముఖము

"తిక్కన – మహాభారత రచన" మను నీ కావ్యమును రచించిన బ్రహ్మశ్రీ మూర్తికవిగారు నాకు చిరపరిచితులు, ముఖ్యమిత్రులు. నిరాడంబరులు. సహజకవితా విభూషణులు. వీరిది మధురకవిత. అయ్యది సుమపేశల శయ్యామనోజ్ఞమై లలిత మృదుపద భరితమై రససంభరితమై ద్రాక్షాపాకమున రుచులనూరించుచు రసజ్ఞులకు హృదయాహ్లాదియై పదగుంభనము భావబంధురము రసపుష్టియు గలిగి మనోహరముగా గమనించుచుండును.

వీరు పలు కబ్బముల నల్లి కవితారచనలో సిద్ధహస్తులైనారు. సుప్రసిద్ధ యుగకవులగు శ్రీతిరుపతి వేంకటేశ్వర కవులలో "కవనార్థం బుదయించితిన్ సుకవితా కావ్యంబె నావృత్తి. యీభవ మద్దానదరింతు" నన్న కింకవీంద్ర ఘటాపంచాననులు, కవిసార్వభౌములు, నాకును పరమ పూజ్యులునగు వెంకటశాస్త్రిగారి ఆశీర్వాదబలమున సత్కవియైన వారు శ్రీమూర్తికవిగారు. శ్రీశాస్త్రిగారి ఆశీస్సు లెవ్వనికి లభించినను, అతడు కవి కావలసినదే.

శ్రీమూర్తికవిగారి షష్ఠిపూర్తి మహోత్సవ సమయమున వారి స్వగ్రామమున జరిపిన కవితాసభ కధ్యక్షత వహించిన నాటి నా యనుభవము నిందు వివరించవలసియున్నది. నాటిసభలో వీరి "తిక్కన" కావ్యప్రశంస జరిగినది. ఆ సభకు వచ్చిన ప్రముఖ విద్వత్కవి శ్రీజటావల్లభుల జగన్నాధశాస్త్రిగారు, (సీనియర్ తెలుగు పండితులు) బ్రహ్మశ్రీ ప్రక్కి విశ్వనాధశర్మగారు (హెడ్మాష్టరు, కైకరం హైస్కూలు) వీరి కబ్బమునుగూర్చి తిక్కన కవితాప్రతిభను గూర్చియు మరపురాని చక్కని ప్రసంగములు గావించిరి. శ్రీయుతులు ప్రక్కివారే వీరి యీ కృతి యచ్చగుటకు ప్రధానకారకులు.

ఈ కావ్యము నందలి యితివృత్తము దంతకథగా నాంధ్రలోకము నకు సుపరిచితమైనదే, కాని యద్దాని చక్కని చిక్కని చక్కెర పాక మున మధుర ఘుటికల బోలు పద్యములలో నంతరించి ఆంధ్రభాషా భిజ్ఞలోకమున కుపాయనముగా శ్రీ మూర్తికవిగా రందించినారు. కృతి ప్రారంభమున "శ్రీకరమై" అని యారంభించిన మొదటిపద్యమునందే వీరి కవితావేశము, కవితాశిల్పము ద్యోతకమగుచున్నది. మనుమసిద్ధి నృపాలునకును తిక్కనమహాకవికిని కల్పించిన అల్లుడు మామ వరు సలు ముందు రసాభాసాలంకృతికి తావలమయ్యును తుదకు సుఖాంత ముగా పర్యవసించి తిక్కన మనీషిని సోమయాజిని గావించుటకును భారతాంధ్రీకరణము సిద్ధించుటకు రాజ, కవిరాజుల కీర్తి అచంద్రార్క స్థాయిగా నొప్పారుటకు కారణమై చదువరుల నాకర్షించుచున్నది.

మనుమసిద్ధి నృపాలుడు తిక్కనకవీంద్రుపై గినిసి యాడిన—

" రాజుల కొల్వులే సుకవిరాజుల భూతల నాకసీమ, లా
రాజుల దోచి యిక్కవితరాజులు గవ్వయు సేయువారె?"
పద్యము చక్కని పాకమున బడినది.

రసజ్ఞుడగు మనుమసిద్ధి పశ్చాత్తప్తుడై పలికిన—

" రాజుల కంకుశంబు కవిరాజుల తీవ్రతరోక్తి " పద్యమును రసవత్తరముగ చిత్రింపబడి యుభయుల మైత్రికి బీజభూతమైనది. పశ్చాత్తప్తుడైన నృపాలుని హృదయమెఱింగి కఱంగి కవిరాజు రారా జును కౌగిలించుకొని, "హరిహరనాథ దివ్యచరణాంకిత బవ్యమహాంధ్ర భారతంబురువడి వెల్కొదఁ సురుచిరోక్తిని" అని ఆశ్వాసించి యాజియై గురునాధుడు వ్రాయసకాడై లిఖింప " శ్రీయనగౌరినా " అని భారతా మ్నాయము ప్రవచించి "ఆంధ్రావళి మోదముం బొరయునట్లుగ" జేసి కృతార్థుడైనాడు. శ్రీమూర్తికవిగారు చాలవరకు సమర్థతతో కబ్బమును నిర్వహించినారు. కవిగారికి అధునాతన పదప్రయోగములందు కూడ నించుక యుత్సుకతచే అచ్చటచ్చట మచ్చునకు ముచ్చటగా భావించి పక్కా", "ధీమా" మున్నగు పదములు వాడినారు.

అంతమాత్రమున మధురకవి నాదగిన మా మూర్తికవిగారి కవిత కవితల్లజుల పోకడలకు తీసిపోవునది కాదు. నిష్పాక్షికముగా నా యీ ప్రశంసావాక్యములు భాసిల్లుటయే నా లక్ష్యము. శబ్బము నందలి నూటపదారు పద్యములు నించుమించుగా నన్నియు మధురాతి మధుర ములు. కవిగారు అచ్చటచ్చట శ్రీతిక్కనగారి పద్యములు పొదుగుట, కుందనమున రతనాలు పొదిగినట్లొప్పారి కావ్యకన్యక కనర్ఘభూషణమై యొప్పారినది. శ్రీహరిహరనాధుని నుతించుచు వీరు రచించిన

"సీ॥ శ్రీపతిత్వంబును .... .... ...."

"సీ॥ తతమణీఫణ విరాజితుండైన ...."

సీసములు వీరి కవితాప్రౌఢిమను వేనోళ్ళ జాటుచున్నవి. ఇట్టి మహనీయుని కృతులు "భారవి" మున్నగునవి అచిరకాలముననే ఆంధ్రభారతికి రుచిరాలంకారములై విరాజిల్లగలవని యాశించుచున్నాను. ఈ కావ్యము ప్రభువులకును కవులకును గల అనివార్యసంబంధమును ధ్రువపఱచుచున్నది అద్దాననే—

శ్లో॥ ఖ్యాతా నరాధిపతయః కవిసంశ్రయేణ
రాజాశ్రయేణచ గతాః కవయః ప్రసిద్ధిమ్" అన్నారు పెద్దలు.

విశ్వకళాపరిషత్తువా రిట్టి సత్కవుల గుర్తించి పోషించి వాగ్దేవి యాశీస్సుల నందుట ధర్మము. శ్రీమూర్తికవిగా రిట్టి కమ్మని కబ్బముల పెక్కు రచించి భాషాసేవకులై వర్ధిల్ల పరమేశ్వరుడు వీరికి దీర్ఘాయు రారోగ్యములు ప్రసాదించుగాత!

నాకీ పీఠిక రచించు సదవకాశ మొసంగినందులకు శ్రీమూర్తికవి గారికి నా ధన్యవాదములు.

ఇట్లు,
సజ్జన విధేయుడు,
మంచం బుచ్చిలింగప్పశాస్త్రి.

వడలి,
8—6—1964.

శ్రీ హరిహరనాథ పరబ్రహ్మణేనమః

# సమీక్ష

జీవికకై చేపట్టిన వృత్తికిని, అంతర్నిహితమైన కళా కలనాకలాపమునకునుపొత్తు కొన్నియెడల కుదురకపోవచ్చు నను అభిప్రాయమునకును శ్రీ పెలిది సత్యనారాయణ మూర్తి కవిగారి విషయమొక ప్రత్యక్షనిదర్శనము. వృత్తిచే ప్రాథమికోపాధ్యాయులయ్యు కవనమున అష్టావధానులై బ్రహ్మానందమునకు సబ్రహ్మచారియగు కావ్యానందమును తామనుభవించి యితరులకద్దానిని పంచిపెట్టి సద్గ్రంధకర్తలై ధన్యులైనవారు శ్రీమూర్తి కవిగారు. వీరిమూర్తి విశేషము బాహ్యాడంబర శూన్యమై కవితాశైలూషికినై పథ్యమైయుండుట యొక విచిత్రము. 'కావ్యాలంకరణ క్షమేవ కవితా కన్యా వృణీతేస్వయం' అను నార్యోక్తికి వ్యక్తి లక్ష్యప్రాయుఁడు.

'తిక్కన - మహాభారత రచన' అను నీచిన్నికృతి ఆంధ్రవాఙ్మయమున నొకవిశిష్ట స్థానము సంతరించుకొన్నది. ఇట్టిపోకడతో నిట్టి కవిచరిత్రను తెనుగున చక్కని కావ్యముగ రచించిన వారరుదు అసలు చారిత్రకవిషయములు ఆంధ్రమున కావ్యరూపమునందినవి చాల తక్కువ. ప్రకృత కావ్యము కాక మూర్తి కవిగారి లేఖినినుండి 'శ్రీ కృష్ణదేవరాయ విజయము', 'నీలాపనింద', 'విశ్వనాధనాయకుఁడు', 'భారవికవి', యను కావ్యములు కూడ వెలువడి ముద్రణ భాగ్యమునొంద

ఆంధ్రలోకమందలి రసజ్ఞులగు వితరణశీలురవైపు ఆసతో నిరీక్షించుచున్నవి.

ఈ కృతిలో మనుమసిద్ధిరాజు భావప్రకటనము, తిక్కనకవి వ్యతిరేకత, రాజుప్రతిజ్ఞ, తిక్కనకవి సోమయాజియై భారతరచన కుపక్రమించుట, అను విషయములు కథాక్రమమున చక్కని వస్త్వైక్యముతో చిత్రింపబడినవి.

ఆరంభించిన పద్యమును కుంటువడని గమనముతో తుదిముట్ట రమణీయముగ రచించగల నేర్పు శ్రీమూర్తి కవిగారిది.

శ్రీకరమై, సుహృజ్జన వ ♦ శీకరమై వరకుందశంఖ ప।
ద్మాకరమై, సమస్తనిగ ♦ మాగమశాస్త్ర విభూషితద్విజ।
న్మాకరమై, శుభాకరము ♦ నై, భుజసత్త్వనిరాస్తవైరి భూ।
పాకరమైన సింహపుర ♦ మంచిత సర్వకళానివాసమా॥

ఇత్యాది పద్యరత్నములీ యాంధ్ర కావ్యభూషణమున పొదుగబడి యున్నవి.

'ఆపుర మేలుమేలు భళి–రా......' 'భాషావరశేష భోగి' వంటి పూర్వకవి ప్రయోగము లిందు యథాతథముగ గ్రహింపబడి వానియందు కవిగారికిగల గౌరవౌన్నత్యమును చాటుచున్నవి. 'వలదన్నన్ జనువాడగీమునకు' అను పద్యమున 'వలదన్నన్' 'రావలదన్నన్' 'పోవలదన్నన్' అను ప్రయోగములందలి అక్షరరమ్యత కడుహృద్యము. 'నే, కల ముంబట్టి కవిత్వమున్ గిలుక' అనుటలో నుడికారపు సొంపే

కాక, తిక్కన పాత్ర కాక చక్కని వ్యక్తిత్వనిరూపణము కూడనున్నది. చివఱకు భారతమును తానుగావ్రాయక గురునాథునిచే వ్రాయించి తన ప్రతిజ్ఞను నిలుపుకొన్న అమోఘవచస్కునిగ తిక్కనను చిత్రించిన కవిగారి శేముషీనైపుణి అత్యంత ప్రశంసనీయము.

"మమునిటు కొల్వులోన నవ ♦ మానము పాలొనరించు నీదుమా,
నము గొఱిగించి, పీటను బ్ర ♦ జల్ నగ దప్పులతోడ నిమ్మునం,
భ్రమమునఁద్రిప్పి, పిమ్మట బు ♦ రంపు బయంటను అకుటింటమాం,
సముదినిపించి, నిప్పిడక ♦ శాలకు, మన్మమహీవిభుండనే?"

అనుమనుమసిద్ధి ప్రతిజ్ఞయందు తిక్కనను పరాభవింతునను భావముతోపాటు, ధ్వనిగా నాతనిచే యజ్ఞము చేయింతుననువిషయముకూడ వ్యక్తీకరించి, ఆంధ్రవాఙ్మయపోషణయందద్వితీయ స్థానమలంకరించిన మనుమసిద్ధివంటి మహనీయుని నోటివెంట వెలువడు ఆగ్రహవచనములుకూడ రిత్తవోని శుభఫలదములని కవిగారు నిరూపించి, చక్కని పాత్రపోషణ గావించినారు. పై పద్యమే కథయందలి చమత్కారమునకెల్ల మూలాధారము. ఇందు యజ్వకుచేయు క్షురకర్మ, వాద్యములతోడి యూరేగింపు, మాంసభక్షణము, యజ్ఞశాలను తుదిని దగ్ధముచేయుట మున్నగు సనాతనాచారములు వర్ణితములై నేటిచదువరులకు విజ్ఞానప్రదములుగ నున్నవి.

"తిక్కామాత్యుడు దవ్వనన్ మనుమసి - ద్దింగాంచె; హర్షాశ్రులన్।
గ్రక్కెన్ గన్గవ; విచ్చెమోము రవిరా-కన్ బంకజంబుంబలెన్।
జక్కన్ సుస్మితవక్త్రముల్ పఱచెనో-ష్ఠంబుల్ మహీజానికిన్।
జెక్కుందొన్నెలు స్వేదపూరమును నిం-చెన్ తేని యాహ్వానకై"॥

అనుపద్యమున ఆలంకారిక చాతుర్యము బహుకమనీయమై, కవిరాజు రాజరాజునకుజేయు రాజలాంఛనసమన్విత మగు స్వాగతమును మన మనోనేత్రముల యెదుట సాక్షాత్కరింపజేయుచున్నది.

'రాజా! సంశయమేల......జామాతవ్రమున్నమైతివి గదా......' అనుచోట 'నీకెదివఱలో నిర్వచనోత్తర రామాయణకావ్యము నంకితమిచ్చి యుంటినికాన నిప్పటికే నా అల్లుడవైతి' వని యనుచు, మఱలనిప్పుడు భారతకృతినిగూడ తనకేకృతినిమ్మని తన్ను వేధించుచున్న మనుమసిద్ధిని 'జామాతవ్రమున్నమైతివి' అని శ్లేషగ 'జామాతాదశమోగ్రహః' అను చమత్కారసూక్తిచే ఎత్తిపొడిచినట్లు స్ఫురింపజేసినారు ఇందు తిక్కనగారి 'హరిహరార్చాసన్నచిత్త' కమలములోని సుగుణ సౌగంధ్యము ఘుమఘుమలాడ విరజిమ్మబడినది. 'కని యెన్ పత్రములందు నందుగల పక్కా పద్యముల్' అనివీరు వ్రాసినపంక్తి వీరిపద్యములకే వర్తించును. 'పక్కా', 'ధీమా' ఇత్యాది అన్యదేశ్యపదములనుగూడ వీరు సమయోచితముగ బ్రయోగించినారు.

ప్రాజ్ఞుని సర్వలోకహృద-యజ్ఞుని, విజ్ఞు, సమస్తతంత్ర మం।
త్రజ్ఞుని, ధీరు, వీరు, మతి-మంతుని, శాంతు, మహాకవీంద్రు, మం।
త్రజ్ఞని, బండితున్, సుగుణి-దాంతుని మంత్రిమణిన్ వృథాక్రుధన్।
విజ్ఞతవీడి నేబరిభ-వించితి నేటికి నా(దవజ్ఞతన్?॥

అనుపద్యమునందలి యతి, ప్రాసస్థానముల మంజులతర పదవిన్యాసమునకు దలలూచి మెచ్చనివారెవరు? 'మీసలమీది తేనియల్', 'శాపత్రియము', 'ఒక్క కోల... పిట్టలరెంటి కొట్టుట', 'త్రోసిరాజనుట' మున్నగునవి యీ కావ్యమందలి చక్కని జాతీయ ప్రయోగములకుదాహరణలు.

'సుకవితా యద్యస్తి రాజ్యేనకిమ్' అను భర్తృహరి వాక్యమునకీకావ్యమందలి యితివృత్తమేకాక, యిందలి కవిత్వము గూడ లక్ష్యమైనది. సమాజమున కవియొక్క ప్రముఖస్థానము ఈకావ్యమున చక్కగ స్ఫుటీకరింపబడి నేటి వారికి కనువిప్పు కలిగించునదిగనున్నది. 'హరిహరనాథ దివ్యచరణాబ్జ సుధారసపానమత్తభంభరమిది; యన్యజాతికుసుమంబుల వ్రాలదు' అని తిక్కన ముఖతః పలికించిన మూర్తికవిగారి హరిహరనాథ భక్తి అనన్యమని,

సీ॥ "తతమణీఫణ విరా-జితుడైన ఫణిరాజు।
పాన్పుగా దోడవుగా - బరిఢవిల్ల।
మునుగు భక్తులపాప - ములకాశనము సేయు।
స్వర్గంగ చరణ మ స్తములవెలయ।
బూతజక్కవలకుఁ - బువ్వ వన్నయనముల్
గనుఁగవ్వ గనువిప్ప - గలుగఁజేయ।
విరహులఁగవగూర్చు - స్మరుఁడు కుమారుఁడై।
విద్వేషిమైకూర్మిఁ - బెంపఁదురింప।

గీ॥ భజనమొనరించు తావక- భక్తులందు।
నొకరు "హరి" యన "హరుఁ" డంచు- నొకరనంగ।
హరిహరాత్మకతం బొల్చి- యలరుని న్న।
యహరహము భక్తిఁగొల్తు దే-వాదిదేవ!॥

అనుపద్యము చాటుచున్నది ఇందలి శైలియు, భావనా విశేషమును, భక్తిభావమును, నాచనసోముని

"పన్నగంబులరాజు - పగవాఁడు గూడిసీ।
శయనంబు బయనంబు - సంతరింప"

అను పద్యమును స్ఫురింపజేయును.

ప్రసన్నత, శ్లేష, సౌకుమార్యము మున్నగు కావ్య గుణములు ఈ కృతియందు బంధురముగ గానవచ్చును. ఇట్టి సత్కావ్యమునకు 'సమీక్ష' వ్రాయు భాగ్యము కలిగినందులకు మమ్ము మేమభినందించుకొనుచు, ఈ కావ్యము సర్వతోముఖ ఖ్యాతిగాంచునట్లు శ్రీహరిహరనాథుఁడనుగ్రహించుగాతమని యాకాంక్షించుచున్నాము. శ్రీ మూర్తికవిగారి యితర అముద్రిత రచనలుగూడ అచిరకాలముననే ముద్రణ నొంది యాంధ్రభాషాయోషకు అమూల్యభూషలై వెలుగొందునని యాశింతుము.

ఇట్లు,
విద్వజ్జన విధేయులు,
ప్రక్క విశ్వనాథశర్మ, B. Sc., B. Ed.,
ప్రధానోపాధ్యాయుడు.
"సాహితీ మధురవచన", "భాషాప్రవీణ"
జటావల్లభుల జగన్నాథము,
ప్రధానాంధ్రోపాధ్యాయుఁడు.

పరిషత్ హైస్కూలు,
కైకరం, ప॥గో॥జిల్లా.
1—6—1964.



# అభిప్రాయము

అష్టావధాని శ్రీ మూర్తికవిగారు రచించిన తిక్కన-మహాభారత రచన యను కావ్యమును జదివి యానందించితిని. కవిగారిందు తిక్కన మహాభారతము నందలి పదునేను పర్వములను హరిహరనాథదేవుని కంకితముగా రచించిన పరిస్థితులను రసవంతముగా వర్ణించియున్నారు. కోపమున మనుమసిద్ధి కావించిన ప్రతిజ్ఞ యజ్ఞాచరణరూపమున నిర్విఘ్నముగా నిరుపద్రవముగా నెఱవేరుట యెంతయు రమ్యముగా నున్నది. ఇందలి 116 పద్యములును 116 రత్నములు. రచన నిర్దుష్టమై మృదు మధుర పద శోభితమగుటచే ప్రసన్నమై, భావగంభీరమై యాకృతిని జిన్నదయ్యు నానందసంధానమున మిన్నయై చెన్నారుచున్నది. ధారాశుద్ధి యవ్యాహతమై యలరారుచున్నది. శ్రీపతిత్వంబును- తతమణీఘణ-మున్నగు పద్యములుదాత్తములై పూర్వకవుల రచనలను దలపించుచున్నవి. కవిగారింకను రసవత్తర కృతులు గావించి యాంధ్రవాఙ్మయము నలంకరింతురుగాక.

18/4 బరకత్పుర,
హైదరాబాదు 27
15—5—1964

ఇట్లు విధేయుడు.
డా॥ దివాకర్ల వేంకటావధాని,
ఎం. ఏ. (ఆనర్సు) పి. హెచ్‌డి.

ఓం

శ్రీరస్తు!

# కృతజ్ఞతాభినందనలు

లోకమున వాక్శూరు లెందరైన నుండవచ్చునుగాని "చెట్టు జెట్టునం గలుగఁగ నేర్చునే గొడుగుకామ?" లన్నట్లు కార్యశూరు లెందరో యుండరన్నది నగ్నసత్యము. సత్కార్యాచరణమున కర్తృతయు, సంస్కృతియు జీవనాడులవంటివి. "స్వభావ ఏవైష పరోపకారిణామ్" అన్నట్లనభ్యర్థిత దాతృ ధీగుణసంపత్ప్రభాసమే వారి యశః కాయముల కాభానముగాని ప్రకాశము. అట్టి కీర్తికాములలో మహోదారులగు బ్ర.శ్రీ ప్రక్కి విశ్వనాథశర్మ, B. Sc., B. Ed., (ప్రధానోపాధ్యాయులు, విద్యాభివర్ధనీ హైస్కూలు, కైకరం) గారొకరు. వారు పెనుమంట్ర హైస్కూలు హెడ్మాష్టరుగా నున్న తరుణంబున (ది 18—4—1959సం॥) సహోపాధ్యాయ సహాయముతో నచ్చట ప్రథమమునను, తదుపరి నా షష్టిపూర్త్యుత్సవమునకు (ది 11—1—1964 సం॥) ఈ సత్తారామేశ్వరము విచ్చేసి మోదాంతరంగులై ఆపిమ్మట ది 15-2-1964 సం॥స కైకరమున సహోపాధ్యాయ బృందముతో జరిపిన "తిక్కన జయంతి" సందర్భమున ద్వితీయ పర్యాయమును నన్ను ఘనముగా సన్మానించి నాకవితాలతికా ద్వితీయ కుసుమమునకునిట్లు లోకము వెలుగు జూపింప దోహదకారులైరి. అయ్యదనున నుదారులగు నాయూరి గ్రామీణులును నా యెడల వితరణమును ప్రదర్శించి తమ భాషాభిమానమును వెల్లడించిరి.

శ్రీజవ్వాది లక్ష్మయ్యనాయుడు జమీన్దారువారు చిరకాలముగఁ ప్రతి వత్సరమును నాకు ధనసహాయము చేయుచు దమ కవికులాలంకార, వాఙ్మయోద్ధారకతలఁ బ్రతిబింబింపఁజేయుటంజేసి యీ లతకూనకు మహారాజపోషకులనుగా వారినిందు బ్రకటించుట సమంజసమని భావించితిని.

ఈ కావ్యకుసుమము వికసింప నితరులు గూడ సహకరించి తమ భాషాభిప్రియత్వమును జాటిరి. పైని( బేర్కొన్న దాతలందఱకు నా హృదయపూర్వక కృతజ్ఞత లర్పించుచున్నాను.

అడిగినంతనే నా యందలి ప్రేమతో నా కావ్యకన్యక ధమ్మిల్లమున( దమ "ఆముఖ" మను శిరోభూషణముచే నలంకరించిన పూజ్యశ్రీ శతావధాని మంచం బుచ్చిలింగప్పశాస్త్రిగారికిని, నిరవద్య హృద్యమగుతమ సమీక్ష నొసఁగి కావ్యమునకు శోభకూర్చిన మిత్రశ్రీ ప్రక్క విశ్వనాధశర్మ, చి॥ జటావల్లభుల జగన్నాధశాస్త్రిగార్లకును నా కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాను.

ఈ కావ్యముపై దమయమూల్యమగు నభిప్రాయమిచ్చిన బ్ర.శ్రీ దివాకర్ల వేంకటావధానిగారికిని కృతజ్ఞతాభివందనములు.

చెప్పినంతనే శ్రమయనక ఈ గ్రంథముఖచిత్రము జీవకళయుట్టిపడ( గళామయ మొనరించి యిచ్చిన, విశ్వకవి రవీంద్రుని విశ్వవిద్యాలయ (విశ్వభారతి) విద్యార్థియు(, గళాతపస్వియు నగు చి॥ డి. శ్రీనాధరత్నశిల్పి వుడయారునకును, ముద్రణమున నీ లేఁజిగురు మొగ్గకొక యాకృతిగూర్చుటలో మిక్కిలి శ్రద్ధాసక్తుల జూపుటయేగాక దీనికి రాజపోషకులై తమయౌదార్యమును బ్రకటించిన యు. యన్. ప్రింటింగు వర్క్సు యజమానులగు శ్రీ మల్లిడి రామిరెడ్డి, యీ కోటిరెడ్డి సోదరులకును నిండుమూలమున మదీయాభినందనల నందించుచున్నాను.

సత్రారామేశ్వరం,
15—3—1964

ఇట్లు,
గ్రంథకర్త.





గ్రంథకర్త:

అష్టావధాని:

**శ్రీ వెలిది సత్యనారాయణమూర్తికవి.**

( జననం : 1903 డిశంబరు )

I

ఓం

హయగ్రీవాయనమః

# కృత్యాది

శ్రీకారంబును జుట్టితిం గృతికి నిన్ జిత్తంబున న్నిల్పి, నీ
వాకారంబును దిద్ది తీర్తు వను పెల్లాసక్తిమై నమ్మి; నా
యాకాంక్ష న్నెరవేర్పు, లేనియెడఁ గృష్ణా! అయ్యపఖ్యాతి నీ
కేకాదా! మఱి కర్తనే యగుదు; నేదే తప్పు—పూచీ పయిన్॥

గీ॥ మఘువు మౌళిని మందార మాలఁ దేనెఁ
దాగ్రివు వెనకయ్య పాదరాజీవ యుగళి
రజము, మత్కావ్య రచనాంత రాయవార్ధిఁ
ద్రావుఁగావుత నాయందు దయఁ దలిర్ప॥

గీ॥ అక్షర వచోమయం బగు నఖిల వాఙ్మ
య ప్రపంచము దనరూపమై రహించు
నలుమొగంబుల వేలుపు చెలువఁ గొలుతు
నారసన సిచ్చలు వసించి నాట్యమాడ॥

గీ॥ తలఁతుఁ గవిదోగ్ధలకుఁ గవితాపయస్సుఁ
బితికినకొలందిఁ జేపుచుఁ బితుకన ల్లై
సంగు వాగ్ధేను వౌ సరస్వతి నిరంత
రమును, నాజిహ్వఁ దొరలింప నమృత కవిత॥

# II

గీ॥ పుట్టుబుట్టువు వ్యాసుండు మున్నుగాఁగ
సంస్కృత కవీంద్రులకు నమశ్శతము లొసఁగి
యాదికవి తిక్కయజ్వాదు లౌ సనాత
నాంధ్ర కవులను వాక్శుద్ధి కభినుతింతు॥

చ॥ గురుతర రామకృష్ణకవికుంజర కుంభవిదారణక్రియో
త్కరులనుఁ, గాకవిప్రకరకంఠవిలుంఠన చండిమక్రియా
పరులను, శేముషీగురుల భవ్యుల మద్గురుదేవులం దమిం
దిరుపతి వేంకటేశకవి ధీరులఁ గొల్తు వచో విశుద్ధికై॥

ఉ॥ గంటలు గట్టి చాటఁగలకైతల నల్లఁగ నేరఁ గాని, నే
బంటు దనాన నా తెనుఁగు వాణి గళమ్ము నలంకరింపఁగా
మంటి; మనోజ్ఞపద్యకుసుమ గ్రథితామలకావ్యమాలఁ; గ
న్నంటక, లెస్సమైఁ జదువ కైన విమర్శలు సెల్లవెచ్చటన్॥

ఉ॥ తప్పుల నెంచుటే కుజన తండము కార్యము,-జీవితంబు ద
ప్పొప్పుల మేళనంబ; యిలనొక్కఁరు డొప్పుల మాని యెవ్వఁడేఁ
దప్పులనే గ్రహించుట యధర్మము; గావున నాదు కైతలోన్
దప్పుల వీడి యొప్పులఁ గొనందగు నాతని కేను మ్రొక్కెదన్॥

గీ॥ ఆంధ్రగీర్వాణములను "నేలంటె" వదల
దైన నీగతిఁ గావ్యనిర్మాణమునకుఁ
బూనితిఁ దెగించి; దేవ! నీపూర్ణకరుణ
లేక సంపూర్ణమొనరింప నాకుఁదరమె?॥

III

కం॥ కవితారీతులు పెక్కులు
గవి సంస్కృతిఁ బట్టి వెలయుఁ గావ్యంబులు న
య్యవియుం బలుతెఱఁగులు, చిని
కవితలు నొకచోట మదికిఁ గౌతుక మిచ్చున్॥

సీ॥ సృష్టికర్తకును జగాన నెల్లగతులఁ
బరముగా దెల్లయెడల నందఱును దనుపఁ
జిన్నికైతయు నెచటనో వన్నెఁగాంచుఁ
"గవిత యొక్కరి సొ" మ్మనఁ గాదు నూవె॥

కం॥ ఒక్కరు మెత్తు రటంచే
నిక్కావ్యము వ్రాయఁబోవ; నెటులైనను నీ
వొక్కఁడవు మెచ్చుకొన్నం
దక్కొరులఁ దలంపనేల? తామరసాక్షా!॥

శా॥ నీకుంబ్రీతి ఘటింపఁగల్గితిన యేనిం జాలు నాకంతె; నీ
వైకుంఠ మ్మరచేతిలోనిదెగదా! పద్మాక్షు! నాచే నెటుల్
నీకామోదము అల్లె యీ రచనముం జిత్రింపఁ జేయించుకో
నీకున్ భక్తి నమించి నీకరుణలోనే దీని సాయించెదన్॥

ఉ॥ నీ దరహాసభాసుర వినిర్మల సత్కరుణార్ద్రి దృష్టి మాం
శూదయరోచుల న్నెమకుచున్న చకోరమ నేను; నీకృపం
బొంది దెొనర్చి పైనొలుకఁ బోయుము దీనిఁ దరింతు నిట్టె; నీ
కేదయగల్గెనేని ఇదియెంత? భవాంబుధినే తరించెదన్.

గీ॥ శంక లొనరింప వచ్చు నిశ్శంకముగ స
దుత్తరము లీయఁ గల పండితోత్తములకు
ఇతరులకు సెంకసేయు సర్హతయె లేదు
శంకయే సేయఁ బోరు రసజ్ఞు లెపుడు॥

చ॥ "అలునటఁ గొంత పేలవమునందె, రసంబది జాఱిపోయెఁ, గొ
న్నిట జిగి సన్నగిల్లె" నననీ అల తజ్ఞ విమర్శలేని ప్రో
త్కట కృతులుం గవీశ్వరులె తక్కువ దేవ! రసజ్ఞపాళిఁ ద
న్పుటె కవి కోర్కి కావ్యరసమున్ గ్రహియించుటె తజ్ఞనీతియా॥

సీ॥ ప్రభవ మందినది సారస సంభవాన నా
జ్ఞాతపూతం బగ్రి జన్మకులము
వర్ధిల్లినది భవ్యవరపరాశరముని
స్థాపితంబగు పరాశరపురంబు
చేయుచున్నది ఛాత్ర జీవితాశయ నిర్వ
హణ సమర్థం బుపాధ్యాయ వృత్తి
సేవించునది భవచ్ఛ్రీ దివ్య తతిపాద
పంకేరుహా ద్వయీ భద్ర ముద్ర

గీ॥ గురులు చెళపిళ్ల వేంకటేశ్వరులు నాకు
అంబ కామాంబ తండ్రి రామాహ్వయుండు
రత్నపర్వత సత్యనారాయణాభి
రక్షితుండను సత్యనారాయణుండ॥

చ॥ అలవెలనాటి శాఖను ద్విజాన్వయ వారినిధిన్ జనించితిన్
వెలిది గృహోపనామకుఁడ బ్రీతమనస్కుఁడ సత్యదేవ స
ల్లలిత కృపాకటాక్షవరలబ్ధ భవుండను వాని పేరునన్
వెలసిన వాఁడఁ దావక పవిత్రపదాబ్జ పరాగపాంశువన్

సీ॥ ధీమంతులైన శ్రీకామేశ్వరీ రామ
మూర్తి దంపతులకుఁ బుత్రులమయి
వసుసగాఁ బుట్టు నేవురియందు నేన పె
ద్ద సుతుఁడ నిత్యసత్యవ్రతుండ
నాంధ్ర బాణాఖ్య విఖ్యాతుఁడౌ శేషశా
స్త్రియు విశ్వనాథశాస్త్రియును. మఱియు
రాణఁ గామేశ్వరరావు సంగీత వి
ద్యావేత్త సుబ్బరావను నతండు

గీ॥ గూర్మి నైదోడులై భక్తిఁ గొలుచుచుండ
అష్టఘంటకవీంద్ర విఖ్యాతిఁ గాంచి
"మూర్తికవి" యను పేరునఁ బొల్చువాఁడ
సహజకవితాచరణుఁడ సూరిసన్నుతుండ॥

శ్రీ ర స్తు!

# తిక్కన - మహాభారతరచన

శ్రీకరమై సుహృజ్జన వ
శీకరమై వరకుంద శంఖ వ
ర్ణాకరమై సమస్త నిగ
మాగమ శాస్త్రవిభూషిత ద్విజ
న్మాకరమై శుభాకరము
నై భుజసత్వనిరాస్తవైరి భూ
పాకరమైన సింహపుర
మంచిత సర్వకళానివాసమౌ॥ 1

ఉ॥ ఆపురమేలు మేలు భళి
రా! యనఁగాఁ దొలి మన్మసిద్ధి రా
డ్భూపతి. శారదాసతి క
పూర్వ సువర్ణచిరత్నరత్న కీ
రోపరిఁ బైఁడి తామరల
నుజ్జ్వలపూజలు సల్పినట్టి భా
షాపర శేషభోగి కన
కాసనమందు సుఖోపవిష్టుఁడై॥ 2

కం॥ హితులును జుట్టము లగు భూ
పతులును సత్కవులు సైన్యపతులుం దదాప్తుల్
చతురమతులైన పౌరులు
చతురత భాషించుచున్న సమయములోనన్ 3

ఉ॥ రాజ నరేంద్రుఁడా భరత
రాజ పవిత్ర చరిత్ర మాంధ్ర భా
షా జలరాశిఁ గౌస్తుభము
సల్పఁగ నన్నయ వేద నామహా
తైజసి ఆంధ్రభారత క
థా కథనాప్తిఁ దృతీయ పర్వమూ
బూఁజిత భంగి వ్రాయుచునె
పూర్తి యొనర్పఁగ లేకపోయెఁగా! 4

ఉ॥ నాఁటికి నేఁటికా విరచ
నంబుఁ బరిపూర్తి యొనర్పఁబోరు-లే
రోటు మహా కవీంద్రు! లిసి
రో! యొకరైనఁ దెనుంగు గడ్డ; న
న్నేటికొ ప్రోత్సహించెఁ జుఁ
డీ! అల పన్నగశాయి యా జగ
న్నాటక సూత్రధారి; తగ
'దా! తలఁదాల్పఁగ నన్నుఁ బోఁటికిన్. 5

కం॥ నన్నయ్య త్రొక్కి నడిచిన
తెన్నుల జాడలనుఁ బట్టి తేకువ వెలయన్
సన్నుతి సంస్కృత భారత
మున్నతి నాంధ్రీకరింప రొక రిప్పటికిన్. 6

కం॥ రీతిని శయ్యను శైలినిఁ
జాతురి వైదుషిని భావసంపద సుకవీ
డ్వ్రాతలు రచియింపఁగ లే
రా! తెనుఁగున్ భారతంబు రసమయఫణితిన్ 7

మ॥ మఱి నేఁ డుద్ధృతమానా! భారత మహా
మ్నాయంబు. భాషాంతరీ
కరణంబుం గొనఁ బ్రోత్సహింప మది సం
కల్పింతు మే మియ్యెడన్
సరిగా నన్నయ కైవడిన్ విరచనన్
సాయించుచో వానికిన్
వరకట్నంబుల నగ్రహారముల స
న్మానింతు మీ కొల్వునన్. 8

మ॥ అలనాఁడే కద! నన్నపార్య కృత ప
ద్యం బొందు తాటాకులన్
విలిఖింపించి య వెల్లపట్టణము లం
దిప్పించినా; మందునం

గలదానిన్ సరిపోల నే సుకవియున్
వ్రాయందు; దూరంపుఁగొం
డలు నున్నా. నిఁక నిందుఁ గల్గిన కవీం
ద్రశ్రేణి యత్నింపనా॥ 9

ఉ॥ "నిండు మనంబు నవ్య నవ
నీతసమానము, పల్కు దారుణా
ఖండల శస్త్రతుల్యము జ
గన్నుత! విప్రులయందు; నిక్కమీ
రెండును రాజులందు విప
రీతము; గావున విప్రుఁడోపు; నో
పం డతి శాంతుఁడయ్యు నర
పాలుఁడు శాపము గ్రమ్మరింపఁగన్"॥ 10

మ॥ ఇది నన్నయ్యది. యిట్లు వ్రాయఁగలవాఁ
డే పంచమామ్నాయ సం
విదితార్థంబుల దర్పణాంతరమునన్
బింబించురీతిన్ రచిం
పఁదగున్ వానిని యెంతొ బ్రహ్మరథముం
బట్టింతు మే మిందు, స
త్పద సమ్మాన సమాదరాదు లనువాం
దం గూర్తు మవ్వానికిన్ 11

కం॥ మాకుఁ గవులార! సెల్లెడు
ఏకన్ మర్యాదలెల్ల విలసిల్లుఁ జుఁడీ!
మాకోరిక పండించెను
మీ కలమునఁ బూచికాచు మీమాంసలలో॥ 12

మ॥ అనుచున్ సూరికవీంద్ర సంతతికి నె
య్యం బొప్పఁగాఁ బంచి యి
చ్చిన తాటాకులలోని పద్దియమునున్
జిత్రంబులందే పఠిం
చినదాసి న్మగుడం బఠించి క్షితిభృ
చ్చిత్తంబులో వారు నే
ర్చినభంగిన్ విరచించి పద్యము సమ
ర్పింపన్ విభుం డందుచున్॥ 13

మ॥ కనియెం బత్రిము, లందు నందుఁ గల ప
క్కాపద్యముల్ గన్గొనెన్,
గనియెం గొండొక పత్ర, మందుఁ గనియె
న్నన్నయ్య పద్యంబె, దా
ననుఁ గాంచెం దొగరంగు వేయఁబడియుం
టం, బెల్లుహర్షంబు వొం
దిన డెందంబున దానిక్రిందఁ గనియెం
దిక్కన్న చేవ్రాలినిన్॥ 14

మ|| కనుఁగొన్నంతనె కౌతుకంబు దలము
న్కల్గాఁగఁ దిక్కన్నమం
త్రిని వీక్షింపుచు మందహాసము ముఖ
శ్రీరోచి రెట్టింప ని
ట్లనియెన్, దిక్కనమామ! కొమ్మన కుమా
రా! తక్కువారెల్ల వ్రా
సిన పద్యంబులు సాటిరావుగద! వా
సి న్నీదు పద్యంబుతో|| 15

ఉ|| ఒక్కరు వృత్తముం, బదము
లొక్కరు నొక్కరు వ్రాసి మార్చి తా
రక్కఱఁ దీర్ప దాని హృద
యంగమముం బొనరించి రెంతయుం
దక్కినవారు గాని అల
నన్నయ పద్దియమే లిఖించి యో
తిక్కకవీంద్ర! నీకరణిఁ
దీరిచి దానికి వన్నె పెట్టి రే?|| 16

శా|| మామా! గూడలు గట్టె "భారత మహా
మ్నాయంబు సాంధ్రీకృతం
బై మాజన్మఁ దరింపఁజేయు" నను పె
ల్లాసక్తి చిత్తంబునం

దీ మాఁకోరిక యొక్క రూపమిడ మీ
రే అర్హు, లెవ్వారి కీ
ధీమా యున్ననుఁ జాల రిందులకుఁ, బ్రా
ర్థింతు న్నిమున్ దీనికై ॥ 17

కం॥ "ఏ నిన్ను "మామ" యనియెదు
దీనికిఁ దగ నిమ్ము భారతీ కన్యక" నా
నానాఁడీ విడవె? కవీం
ద్రా! నిర్వచనం బపూర్వ రామాయణమున్॥ 18

కం॥ నన్నకవి లలిత కవితకు
వన్నియ యిడు మధురకవిత వ్రాయంగల నీ
యున్నతియ యాంధ్రజాతికి
సన్నుతిపాత్ర మగుఁగాత సత్కవిచంద్రా!॥ 19

మ॥ అని యర్థించిన మన్మసిద్ధివిభు మ
ర్యాదన్ విలోకించి తి
క్కన మంత్రీశ్వరుఁ డిట్లనున్ "నృపవరే
ణ్యా! మీ నుడిం ద్రోయరా"
దనియే యెంచెద, గౌరవంబులకు లో
ట్లా? చేట? దీటా? మటో .
క్కని కీర్త్యై వడి బుద్ధిపుట్టుటలు జ
క్కం గాని" యం చాగినన్ 20

శా॥ "ఏమీ? మౌనము! తెల్పుఁడీ! హృదయమం
దే కోరికల్ మూఁగెనో
"ఏమై తీరుతు" మంచుఁ దెల్పితిమి గా
దే! సందియం బేల? ఓ
మామా! తెల్పుఁడు; తీర్తు మేమిపుడ; స
మ్యగ్భారతాంధ్రీకృతిన్
నీమంబుం గొని వ్రాయఁగా దొరకొనుం
డీ!" యంచు భూపుం డనన్॥ 21

శా॥ "రాజా! సంశయ మేల? నా హరిహరా
ర్చాస్విన్న చిత్తంబునం
భ్రాజత్పూజ్య మహాంధ్రభారత కృతి
వ్యాసోక్తికిన్ దావు లే
దే! జామాతవు మున్నె యైతివి గదా!
యీకోర్కె యీ కేల? నా
యీజన్మాంతర బంధ మా హరిహరుం
డే తెల్పఁగా నమ్మితిన్"॥ 22

ఉ॥ నావుడుఁ దిక్కనార్యు వచ
నమ్ముల నాసలు సన్నఁగిల్ల "మా
మా! విరసోక్తి నీ రసన
మచ్చున కేని రవంత రాదు; నేఁ

ఏ విధి దైవ నిర్ణయమొ!
యెట్లగుఁ? గాదయ! నీకలంబులోఁ
బావన భారతాంధ్రకృతి
పర్మిమ్మ పరివర్ధన మందఁగా వలెన్. 23

ఉ॥ స్వాదుగ నాంధ్రజాతి మన
పావన భారత భారతీ రసా
స్వాదన ,సౌఖ్యమందఁ గల
భాగ్యము నోఁచికొనంగ నెమ్మి నీ
వాదు కొనంగదయ్యా! కల
మంది రచింపఁగదయ్యా! భారతం!
బాదివి నీ ధరిత్రి వెలయన్
మన కీర్తులు శాశ్వతస్థితిన్"॥ 24

కం॥ అని జనవిభుఁడు జగద్ధిత
మును మధురిమ ప్రియము బధ్యమును గలుఁగవచిం
చిన పల్కులు విని తిక్కన
యను హరిహరలగ్నచిత్తుఁ డై యీ కరణిన్॥

చ॥ హరిహరనాథ దివ్యచర
ణాబ్జ సుధా మధుపాన మత్త బం
భర మిది; యన్యజాతి కుసు
మంబుల వ్రాలదు సుంత; ప్రీతి ము

ప్పిరి యగు మోదసౌఖ్య పద
వీ నదవీయసి యైన స్వర్గమే
కరము సుఖంకరం బిహ సు
ఖంబులు మీసలమీఁది తేనియల్॥ 26

మ॥ "వల" దన్నం జనువాఁడ గీమునకుఁ; జూ
పన్ మోము మీఁకింక; "గా
వల" దన్న న్మతి రాను కొల్వనకు నె
ప్పాటన్; దయ న్నీవు "పో
వల" దన్నన్ హరనాథసేవ నెడఁదన్
భావించుచు న్నిల్తు; నే
గలముం బట్టి కవిత్వముం గిలుక; ని
క్కం బింత, జం కేటికిన్? 27

కం॥ అన విని జనపతి క్రోధము
మనమునఁ బెనఁగొనఁగఁ దిక్కమంత్రీశ్వరునిం
గని గర్జించెను గొలువున
జనముల నాసికల వ్రేళ్ళు జరుగఁగ నిట్టుల్ 28

ఉ॥ "రాజుల కొల్వులే సుకవి
రాజుల భూతల నాకసీమ, లా
రాజులఁద్రోఁచి యిక్కవి త
రాజులు గవ్వయుఁ జేయువారె? మా

పూజలు మన్ననల్ గొని య
పూర్వముగా, మ దభీప్సితం బిటుల్
"క్రోజక తీర్చిరా" జనెదొ
కో! మ దవగ్రహమున్ స్మరింపవో? 29

చ॥ మము నిటు కొల్వులోన నవ
మానము పాలొనరించు నీదు మా
నము గొఱిగించి, వీటను బ్రి
జల్ నగ దప్పులతోడ నిన్ను సం
భ్రమమునఁ ద్రిప్పి, పిమ్మటఁ బు
రంపు బయంటను ఆకుటెంట మాం
సముఁ దినిపించి, ని ప్పిడక
శాలకు, మన్మ మహీవిభుండ నే!॥ 30

మ॥ అని యాజ్ఞేఁడు ప్రతిజ్ఞఁ జేసె, న నేఁ ది
క్కామాత్యుఁడు న్నవ్వుచున్
"నను నీ వేమి యొనర్చినన్ సరియె నై
నన్ భూపతీ! త్వత్ప్రతి
జ్ఞను సంపూర్ణ మొనర్పఁగల్గిన నిమే
షంబే ముహూర్తంబు; మ
న్ననమై మద్రుచిరాంధ్రభారత మహా
మ్నాయంబు వాక్రువ్వఁగా॥ 31

చ॥ హరిహరనాథ దేవుఁడు త్వ
దాస్యమునం బలికించె నిట్లు భూ
వర! కృప, మామకీన భవ
బంధ విమోచనమున్ సుగమ్య మా
తెరఁగున; నాకు నిచ్చలుఁ ద
దీయ పదాబ్జములే శరణ్యముల్
ఖరకరుఁ జూడ నోచని, కు
లాయము దూరెదు గూబఁగాను సూ!" 32

చ॥ అనుచున లేచిపోయెను మ
హాకవి కొల్వును వీడి; భూమిభృ
త్తును గొలువున్ ముగించె రుష
తో; నది యాదిగఁ దిక్కనార్యుఁడే
పనికినిఁ బోఁడు కొల్వునకుఁ;
బార్థివుఁడుం గబురంపఁ డిట్టులే
చనియెను గొన్నినాళ్లు; క్షితి
జానికిఁ బుట్టె వ్యథా విచారముల్ 33

ఉ॥ "తిక్కనమామ కేల తల
తిక్క జనించిన దల్లనాఁడు? పె
న్మక్కువ నాదరించితిని,
మంత్రినిఁ జేసితి, గౌరవించితిన్

అక్కట! లేవు నక్కవిన
యంబులు, కొంగజపాల్, "మహీసుధా
భు" క్కనియేని నాఁడు తలఁ
పోయక యేల వృథా శరించితిన్?" 34

ఉ॥ ప్రాజ్ఞుని, సర్వలోక హృద
యజ్ఞుని, విజ్ఞు, సమస్త తంత్ర మ
ర్మజ్ఞుని, ధీరు, వీరు, మతి
మంతుని, శాంతు, మహాకవీంద్రు, మం
త్రజ్ఞునిఁ, బండితున్, సుగుణి,
దాంతుని, మంత్రి మణిన్ వృథాక్రుధన్
విజ్ఞత పీడి నే బరిభ
వించితి నేటికి నాఁ డవజ్ఞతన్? 35

ఉ॥ రాజుల కంకుశంబు కవి
రాజుల తీవ్రతరోక్తి; యాకవి
డ్రాజుల గంటపుం గొసల
రాజుల కీర్తులు మొల్చి దిగ్విది
గ్రాజ మదేభ కుంభములఁ
బ్రాఁకి చివిర్చి సుమించి కాచుఁ; ద
ద్భ్రాజిత భోగ భాగ్యములు
భస్మమగుం గవి వహ్నిదృష్టిలో 36

శా॥ ఏ న ట్లన్నను రక్తదృష్టి నయినన్
వీక్షింపఁ బోఁ డింత; పా
పాణవాప్తిములుం గరంగుఁ గద! ఆ
శాంతంబులోఁ; నవ్వుచున్
"భూనాథోత్తమ! నీవు గొన్న ప్రతినం
బూర్ణంబు గావించుకో;
మ్మా నాఁడే యగు నాంధ్ర భారత కృతి
వ్యాఖ్యాన లగ్నం" బనున్. 37

ఉ॥ ఆ కవిరాజశేఖరు, స
మర్థు, మహాశమి నవ్య భారతాం
ధ్రీకృతియే మహాంధ్రి జగ
తీస్థలికిం దలమానికం బగుం
గాక; యుపేక్ష సేయు తఱి
గా దిది; ఆ కవితా లసత్సరా
నోకహు, తిక్కసత్కవి య
నుగ్రహ పాత్రుఁడ నౌదు నిప్డే॥" 38

ఉ॥ ఊరహిం నెంచి కొల్వున న
రేంద్రుఁడు "కోవిదులార! నా మనం
బూరడ దింతయుఁ; మిగిలి
యున్నవి వేలుగ రాజకార్యముల్

దీరక; రా దనుగ్రహము
తిక్కన కింత; సమగ్ర మాంధ్రపున్
భారత మాంధ్ర జాతి విను
భాగ్యము పట్టునొ! పట్టదో! యిఁకన్॥ 39

చ॥ నవరుచి రార్ద్ర మానవ మ
నః ప్రకృతిజ్ఞుఁడు; నన్నపార్య స
త్కవితకు వన్నె వెట్టు కవి
తాహృదయజ్ఞుఁడు తిక్కనార్యుఁడే;
వివిధ మనః ప్రవృత్తి ప్రస
వించు మహాకవి గంటపుం గొనల్
భువి దివి నిండి పాఁకు యశ
ముల్ ప్రభవించుటయున్ విచిత్రమే? 40

ఉ॥ ఈరిక లెత్తు నాపత్రిన
యేగతిఁ జెల్లు? మహాంధ్ర భారత
మ్మేరహిఁ వ్రాయుఁ దిక్కన మ
నీషి? మనీష నటుల్ తలంచి యా
నారనిధిం దరిం గడపు
నావికు లీరలు, నేఁడు నన్ సము
త్తారకుఁ జేయరే! యుభయ
తారక సాధకులై సుధీనిధుల్" 41

చ॥ అను నృపు సూక్తులన్ విని మ
హామతిపారగు లౌ సదస్యు లె
ల్లను జత గూర్చి హృద్ధిషణ
లన్, ఘన తర్క వితర్క పూర్వ ఖం
డన వరమండనంబులఁ బో
నర్చి యుపాయము నేర్పఖడ్గ తి
క్కనయు సహాయపత్త్రికము
గా నిటు పల్కె సయుక్తికంబుగా॥ 42

చ॥ "మనుమ మహీశ! మీ హృదయ
మర్మము నీగతి నేఁటికైన వా
కొనుటకు లోసి కౌతుక మ
కుంఠగతిం బ్రకటించె నిప్పు డీ
జనములు; ముందు మీ ప్రతిన
సాఁగ మహాకవిచేత జన్మముం
బొనరుపఁ జేయుచో సకల
ము న్నరవేరు నబాధకంబుగా॥ 43

సీ॥ యాగ మొనరింపఁ గడఁగిన యతని కాగ
మంబు తొలుదొల్త క్షౌర కర్మము విధించె
విధి విహిత భంగి నద్ది గావింప వలయు
దానఁ బరిశుద్ధి యాగకర్తకు లభించు॥ 44

శా॥ ప్రారంభంబున యజ్ఞకర్తను బురిన్
బాజా బజంత్రీలతో
నూరేగింపుచు వీధి వీధులను బా
హ్యోద్యాన వాటీ శుభ;
శ్రీ రమ్యంబగు పర్ణశాలను బ్రవే
శింపించి యవ్వానిచేఁ
బారంబందఁగ "యాగదీక్ష"ను ధరిం
పంజేతు రర్త్విగ్వరుల్ 45

మ॥ అరయన్ యజ్ఞము పాంచరాత్రికము నై
త్యారాతి సత్రాక; ము
ర్వర మంత్రింబుల సోమ యాగ పశువున్
మ్రిందించి తన్మాంసమం
దరపా ర్త్ర్యోలిచి దక్షిణానలము నం
దా యాయజూకుండునున్
బరిశిష్టంబు భుజింపఁగా వలయుఁ ద
ద్భార్యాయుతుండై యటన్॥ 46

ఉ॥ ఆగతి యాగముం బరిస
మాప్తి యొనంగిన మీఁద వెంట న
య్యాగ నికేతనంబు నన
లార్చుల కాహుతి సేయఁగావలెన్

ఈగతినిం దదిష్టియుఁ ద్వ
దిష్టము రెండునుఁ జెల్లుఁ గావునన్
వేగమ యొక్కకోల నవ
నీవర! పిట్టల రెంటిఁ గొట్టుమీ॥ 47

శా॥ "మామా!" యంచు ననుం గనుం గొనఁగ స
మ్మానంబునం బిల్చుచున్
మా మర్యాదల కెం దొకప్పు డయినన్
భంగంబు రానీయలే
దామాన్యోత్తము; డట్టి జేని నెనరే
నందంగఁ బోనింక కటం
చేమో పల్కుచుఁ గుందుచుండు మది రా
జేంద్రా! మహామాత్యుఁడుౕ॥ 48

గీ॥ కాన తమమాట మన్నింపఁ గలఁడు తిక్క
నార్యకవి సార్వభౌముఁ డం చనుకొనియెద;
మైన నొకసారి కబురంపి యరయవచ్చు
వచ్చునో! రాఁడో! యోజింపవచ్చు మీఁద" 49

మ॥ అనినన్ భూపతి "మంత్రులార! యిపు డీ
రా సూరి యిల్సేరి, పై
మును మా మొక్కల నందఁ జేసి, కుశలం
బుం బృచ్ఛగావించి, మా

మనసున్ వారికిఁ దెల్పి "మేము మిము సం
ప్రార్థించుచున్నార" మం
"చనుకంపం జనుదెం" డటంచు నిట కా
హ్వానించి తోడ్తెత్తురే? 50

చ॥ పరువ పపూర్వ దృష్టిఁ బ్రతి
వస్తువునుం గను తెల్వి గల్గువా
రరుదు: మహా కవీశ్వరులె
అట్టిరు; వారల మేటివీ; వికన్
దొరకొని యిష్ట మామక మ
నోరథము న్నెరవేర్ప ముద్భవ
త్సురుచిర సద్యశ స్సితరు
చుల్ దివి నిండు"నటంటి నండటన్ 51

ఉ॥ వచ్చిన వచ్చు; రానియెడ
వచ్చి యుదంతము నెల్ల మాకు వా
క్రిచ్చెదు; మీఁది వృత్త మిటఁ
గోవిదు లెల్లరు నిర్ణయింతురు; మ
మ్మచ్చటి కంపకుండఁ గల
యచ్చునఁ గార్యము నిర్వహింపుఁడీ
హెచ్చు వచింపఁ బోము తమ;
కీరె యెఱుంగుదు రెల్ల సంగతుల్" 52

మ॥ అని యాజ్ఞేఁ డనుపంగ వారు సని తి
క్కామాత్యుని గాంచి "తి
క్కన మంత్రీశ్వర! సిద్ధిభూపతి నమ
స్కారంబుతో సేమమున్
మను బ్రశ్నించి వచింపుఁ డంచిటకు మ
మ్ముం బంపె; తద్వాక్యముల్
వినుపింపం జనుదెంచినార మిటు పృ
థ్వీనాథు వేడ్కోలునన్॥ 53

ఉ॥ చెప్పఁగఁ గూడ మా రసన
సిగ్గిలుఁ; దొల్లిటి సిద్ధిరాజు గాఁ
డిప్పుడు; మాఱిపోయెను జుఁ
డీ! మది నిబ్బర మూనఁ డింత; దా
సెప్పఁడు నేఁటిదాఁకఁ దన
చిత్తము; గొల్వునఁ గుప్పతిప్పలై
తెప్పలు దేలుచున్నయవి
తీరక యెన్నియొ రాజకార్యముల్॥ 54

ఉ॥ అంతలు వల్కనేల? కొలు
వం దటు నాఁడు కవీంద్ర! యామహీ
కాంతుఁడు; ముందువెన్కలను
గాంచక గర్వము నెత్తికెక్కి పెన్

బంతమునం బ్రతిజ్ఞఁగొని
నాఁడటు; నేఁ డిటెడంద మొప్పిరిన్
జింతిలుచున్నవాఁడు గద!
నేరక తీరమి నే యుపాయముల్ 55

ఉ॥ వేమరు విందుమేము మును
విజ్ఞుఁ డధర్వణసూరి భారతం
బేమొ తెనుంగుఁ జేసెనఁట;
ఎవ్వరు గన్గొన; రొండొరెండొ నేఁ
డేమొ వినంబడున్ విబుధు
లెన్నుచుఁ బద్యములన్ వచింపఁ; గా
నీ, మహి నింకొకండు గన
నేరము నన్నయ దొంటు దక్కినన్ ॥ 56

ఉ॥ "నన్నయ శుద్ధి వచ్చెడు ఘు
న ప్రతిభానిధి, ధీవిభావ సం
పన్నుఁడు. తిక్కనార్యకవి
మండనుఁడే" యనుకీర్తి యెంతొ అ
త్యున్నతిఁ జెంద వాఙ్మయ మ
హాంబుధిఁ బుక్కిటఁ బట్టుకొన్న నీ
కన్నఁ దెనుంగు భారత మ
హాబ్ధిఁ దరించెడు వాఁడెవండయా? 57

చ॥ నరపతి ప్రార్థనమ్మునె ఘ
నమ్మగు నాజ్ఞఁగ స్వీకరించి నీ
దరి కరుదెంచినార మిటు;
త్వన్నయనాబ్దయుగంబు చేనిపై
నరమర లెల్లవీడి కరు
ణామృత శీతలవారి పూరముం
గురిసి యనుగ్రహింప నినుఁ
గోరెద మిప్పుడు మంత్రిమండనా! 58

ఉ॥ కోరము మున్నని; న్నిపుడ
కోరక కోరక కోరినాము; మా
కోరికఁ దీర్పనే వలయుఁ;
గొల్వున కిప్పుడు నీవు రావలెఁ
భూరమణుండు మన్ననల
మున్ వలెనే నినుఁదేల్చు; నెట్టులున్
దీరదు నీకు మామనసు
దీర్పక; యింత కనుగ్రహింపవే"॥ 59

కం॥ అని సిద్ధిరాజు మది మొ
ల్చిన మొల్కకు నీరుపోయు చిత్తంబులఁ ది
క్కన నాహ్వానించిరి వా,
డను మొగమున వెగటు కొంత యగుపడఁ గవియున్

శా॥ మాకుం దీరదు రాజసన్నిధికి రా;
మాధ్యానముల్ పూజలున్
మీకుం గ్రొత్తలె? కాళ్ల కేల మగుడన్
వేయింత్రు సంకెళ్ల? నా
భూకాంతుం డలనాఁటి యాత్మశపథం
బుం బూర్తిఁగావించుకో
నాకాంక్షించెద లోన; నాఁడె కద! నే
నాకోల్పు వీక్షించుటల్ 61

చ॥ నరపతికీర్తి నిల్పితిని
నాకృతినిం గృతియిచ్చి వానికిన్
ధర నజరామరంబుగ; వృ
థాశ్రమ పెట్టుట కాదుకాని నా
హరిహరనాథసేవకు జ
లాంజలు లిచ్చుట గాక వేరు గా
దరయఁగ నిద్ది; అట్టి విల
యంబు నెదుర్కొన కుండ నేర్తునే?'' 62

మ॥ అన నందొక్కఁడు వక్కాణించెను "వయ
స్యా! నీకు సత్కీర్తి గ
ల్గునటుల్ జేని ప్రతిజ్ఞ పూర్తియగు న
ట్లుం గొల్పుపాయం బొకం

టిని సూచించె; యశంబు మీ కొదవు దా
నింజేయ; మీ రట్లు స
ల్పిన నేమున్ జగముం బ్రిమోద జలకే
ళిం దేలి వాలాడమే?" ॥ 63

సు॥ అను పల్కుల్ విని పెద్దగా ప్రమదమున్
స్వాంతంబునం బొంది యి
ట్లనుఁ దిక్కన్నమనీషి, "ఏమి? అవురా!
ఆనందమైపోయె; "న
మ్మనుజేందు్రిండు ప్రతిజ్ఞ నేకరణి స
మ్యక్పూర్ణముం జేయునో!"
అనుచుం గుందితి నేఁటిదాఁక; నదిమా
యంబయ్యె మీ సూక్తులన్ ॥ 64

ఉ॥ ఐన నదే క్రియం బొసఁగు
నంచు మనంబునఁ జంతచేసియుం
గాన నుపాయ మిందనుకఁ;
గాంచితి రీరు మహామనీష; మా
వీనుల త్రిప్ప దుల్లె నొక
వీసము దక్కఁగఁ; దక్కువీసమున్
వీనుల వేసి మా నుతులఁ
బెల్లుగఁ గొం" డని పల్కువారలున్ ॥ 65

చ॥ తెలిపిరి పూసగ్రుచ్చిన గ
తిన్ విషయంబుల నెల్ల నాకపీ
ట్రిలకున; కా కవీంద్రుఁడును
డెంద మమంద ముదంబు నొంద "మేల్!
భళి భళి!" యంచు మెచ్చి స్తుతి
వాక్యములన్ వచియించి కొన్నిటిన్
గలికి దనంబులోఁ గులుకు
గాయలు గాయఁగఁ బల్కెఁబై నిటుల్॥ 66

చ॥ తెలిపితి రీదు: సంతసము;
తేటపడెన్ సకలంబు; మన్మసి
ద్ధులు నడ తెంచి మా గడపఁ
దొక్కి పవిత్రముసేయ, యోజనన్
సలిపెద మీఁద; మీదువచ
నంబులయందలి గౌరవంబునన్
నలలిత మచ్చుభాశిష వ
చస్సుల భూపతి కందఁజేయుఁడీ!"॥ 67

చ॥ అనినఁ దదాత్మగౌరవ స
మగ్ర వచో రచనా ధురీణతన్
మనముల మెచ్చుకొంచు జన
నాయకు సన్నిధి కేఁగి వారు తి

క్కన నుడువుల్ యథాతథము
గా వచియించిరి; తేఁడు బాష్పముల్
కనుఁగవఁగ్రమ్మ, మేను గడఁ
కం బులకింపఁగఁ జెమ్మరింపఁగా॥ 68

ఉ॥ "అంతకు వచ్చినంత వెను
కాడఁగ నేటికి? లెండు పోదమా
పంతపుఁగొండి గీమునకే;
పాంజలి వట్టి యెటో పసన్నుఁ గా
వింతము; బైల పాక నిలి
పింతము; పిమ్మట "యాగదీక్ష" ని
ప్పింతము; ఔ ధనంబు నని
పింతము; కూర్తము వస్తు జాతమున్॥ 69

మ॥ అనుచుం బీఠమునుండి లేచె వసుధా
ధ్యక్షుండు; లేచెన్ సభా
జనముల్; తీర్థము గట్టి సాఁగె ధరణీ
శానుండు ముం దేఁగుచోఁ
గనియెన్ ముందఱ తేఁడు మంత్రి గృహముం;
గాంచెన్ వసారా అరుం
గునఁ గూర్చుండిన మంత్రిమండనునిఁ గ
న్గోనల్ ముదశ్రుల్ గొనన్॥ 70

శా॥ తిక్కామాత్యుఁడు దప్పునన్ మనుమ సి
ద్ధిం గాంచె; హర్షాశ్రులం
గ్రక్కన్ గన్గవ; విచ్చెమోము రవిరా
కం బంకజంబుం బలెన్;
జక్కన్ సుస్మితవస్త్రముల్ వఱచె నో
ష్ఠంబుల్ మహీజానికిన్;
జెక్కుందోన్నలు స్వేదపూరమును నిం
చెన్ తేని యఘ్యానకై॥ 71

శా॥ రానేవచ్చె నృపుండు, వచ్చి కవి స
త్రామాట్పాదపద్మద్వయిం
దానైవ్రాలుచు భక్తి మ్రొక్కెఁ; గవి "పు
త్రిపాప్తిర" స్తంచుఁ బ్రే
మానన్ దీవనచేసి పల్కె "గుణధా
మా! నీ గుణస్తోమమే
నా నిశ్చేయమునున్ సడల్చె; విధి నీ
నా కోర్కె లీడేర్చెతన్॥ 72

ఉ॥ నిన్నుఁ బరీక్షసేయు మది
నిం గబు రంపితి నట్లు, కాని నీ
సన్నుత సద్గుణంబులను
జాలను మెచ్చఁ; ద్వఁగుత్తురోత్త రా

భ్యన్నతిలోన జన్నము స
 ముజ్జ్వలమై సుసమాప్త మాత సి
ద్ధన్నమహీధవా! హరిహ
 రాధిపదైవతమే గలందుపై॥ 73

ఉ॥ ఇంచినవేడుకన్ వసుమ
 తీశ్వర! మిమ్ముల నిప్పు డిట్లు ర
ప్పించిన నాపయి న్మది వి
 వేకమునం బ్రగుడ్చం జిందఁబోక యే
తెంచితి; రంతె చాలును; అ
 దే పదివేలు; శతాగ్రహారముల్
మించినవేడ్క నిచ్చినను
 మేకొనఁబోదు ముదంబు నాకిటుల్॥ 74

ఉ॥ "రాజులనున్ శ్రమంపఁబుప
 రా" దయినన్ శ్రమపెట్టినాఁడ; రా
రాజుల కున్న స్వేచ్ఛయె ప
 రప్రజకుం గల" దంచుఁ దెల్పనే
యీజతనంబు; ఇందుల జ
 యించితి నీకిట్రియు; నర్థికల్పకో
ర్వీజమ! మోము సెమ్మగిలె,
 వీజనముం గొని వీచువాఁడనా?॥ 75

కం॥ అని నుడివి వెంట నృపతిం
దన కగు చందమున మన్ననల నడిపించెన్
జనపతి ముదమున నేదో
అనఁబోయిన నడ్డువచ్చి యనెఁగవి మగుడన్॥ 76

శా॥ "నే నీచే ననిపింతు" నంచు ననుకొం
టే; వెండి! నాకోర్కె కె
క్కైన న్నివాడఁబడ్డఁ గూర్తు త్వదభీ
ష్టావాప్తికిన్ రూపమున్
నే నా నన్నయ భారతంబునకు వ
న్నెం గూర్చుటే కాక ఆ
శ్రీనారాయణు మూర్తిఁదాల్చిన మహా
శ్లింగూడ మెప్పించెదన్॥ 77

చ॥ హరిహరనాథ దివ్యచర
ణాంకిత భవ్యమహాంధ్రభారతం
బురవడిఁ బల్కెదన్ సురుచి
రోక్తిని నాలవపర్వ మాదిగాఁ
గరముఁ బదేను పర్వములు
గాఁ, బ్రతిపర్వరసోదయంబుగా
హరువుగఁ దెన్గుజాతి కుప
హారముగా నుడిపైఁడి కాన్కగా"॥ 78

శా॥ ఆమాటల్ కవినోట వెల్వడ నమం
దానందముం బొంది యా
భూమీనాథుఁడు వల్కె నీకిట్లయ "నవ్వుం
బో! సత్కవీశవ్రభూ!
ఏముంగోరెడి దంతియే; తలఁపకో
యీ! ఒండు డెందంబునం
దీమా టప్పుడె చెప్పితేనిఁ గవి మా
లీ! మేము హర్షింపమా?॥ 79

గీ॥ "గమ్యమొకఁడయ్యుఁ జేరు మార్గంబులెన్నొ
యుండు" నను మాట మఱచిపోకుంటిమేని
విధివలన మోసమౌనె? యవ్విధిని నాఁడు
కడఁగఁదగు నింక "యాగదీక్షకుఁ" గవీంద్ర!॥ 80

మ॥ అనినంతం జిఱునవ్వు దోచెఁ గవి యా
స్యంబందు; ఱేఁడా దరిం
గనుఁగొన్నాఁడు పురోధసు న్నగుచు; ల
గ్నం బుంచె నాతండు వెం
టనె; సంభారము లెల్ల నాఁటి కొనఁగూ
డంజేసి రాబంటు లో
య్య నటన్; "రాజు దలంచినం గొదువ యు
న్నా? లేచెఁబెన్నాలయున్॥ 81

మ॥ ద్విజులున్, విప్రులు, శ్రోత్రులున్ సవనపున్
విందుల్ గడుఁగ మెక్కఁగా
నిజవాసంబులఁ బిల్పు లందికొనుచు
న్నెల్లూరి కానాఁటికిన్
"విజయంచేసిరి"; కోర్కులూరు మదులన్
వీక్షింప వేలాదిగాఁ
బ్రజలేతెంచుచు నుండి రక్కడికిఁ దీ
ర్థం" బట్టు లవ్వారిగా॥ 82

ఆ॥వె॥ ప్రభుఁడు బంధుమిత్ర పరివారసహితుఁడై
కవికి నెరపఁజేసె క్షౌరకర్మ
తూర్యనాదఘోషతోడ నూరేగించెఁ
బట్టణమున వాడవాడలందు॥ 83

ఆ॥వె॥ ప్రథితసవనవేది పరిశుద్ధి గావించి
అగ్నిసాక్షికముగ యాగదీక్ష
యజ్ఞకర్త కొసగిరఖిల ఋత్విజు లందు
మంత్రతంత్ర సరణి మహితభంగి॥ 84

ఉ॥ పాచకశాల బిందియుల
వండను వార్వను బెట్టఁ బోయఁగా
లేచిన వెన్ని విస్తళులో!
లెక్కయె? పొయ్యిల నెల్లఁ ద్రవ్వియే

వై చిరి పట్టణంబున స
వర్ణు లవర్ణులు; వచ్చి జన్నముం
జూచెడివారి సంఖ్య మఱి
చొప్పడ "దింత" యటంచుఁ జెప్పఁగా॥ 85

మ॥ సతియుం దానును దిక్కనార్యుఁడు స్వధా
స్వాహా వషట్కార సం
భృత మాజ్యాహుతి పుష్ట తుష్ట శుచమై
వెల్గొంది గావింపఁగాఁ
గ్రతు వయ్యెం బరిపూర్తి, ఋత్విగభిమం
త్రప్రక్రియాసూర్తి సం
గతి, తదాత్విజపధాప్తిఁ, బంచదిన దీ
ర్ఘానూర్తి పూర్ణాహుతిన్॥ 86

సీ॥ క్రతుదీక్షకై తొల్తఁ గావించు క్షురకర్మ
నృపతిప్రతిజ్ఞఁ దీర్చినటు లయ్యెఁ
దూర్యనాదంబులతోడి యూరేగింపు
నృపతి ప్రతిజ్ఞఁదీర్చినటు లయ్యె
నాశాలలోఁ బురోడాశంబు మెసవంగ
నృపతి ప్రతిజ్ఞఁ దీర్చినటు లయ్యెఁ
గ్రోలిన సోమయాగాగార దాహంబు
నృపతి ప్రతిజ్ఞఁ దీర్చినటు లయ్యె

గీ॥ మనుమసిద్ధి మహీపతిమహాళి యట్లు
చేవఁ దిక్కన కవిరాజుచేత సోమ
యజ్ఞమొనరింపఁజేసి ప్రతిజ్ఞ దీర్చి
సోమయాజినిఁజేసె విశుద్ధమతిని॥ 87

ఉ॥ ఒంటెడుపైఁడి సోమిద కో
హో!యన భూపతి యిచ్చి, మంత్రి హృ
త్కంటక మగ్రహారములఁ
గానుక పెట్టి తోలంగఁజేయ లో
నంటిన భక్తి శాసనము
నప్డ ముదంబున సోమయాజికే
లంటి యొసంగి జన్మచరి
తార్థముగాఁ దలఁచెన్ మనంబునన్ 88

ఉ॥ ఆ మఱునాఁటి పొద్దున మ
హాకవిమాళి యమాత్యకీవిలో
భూమివిభుండు మంజుల స
ముజ్జ్వల సుందర మందహాసరే
ఖామితమైన మోమున న
ఖండ తరంగ తరంగిత ధ్వనీ
స్వామిగతిన్ వెలుంగుచు స
భాభవనంబునఁ గొల్వు దీరుచో॥ 89

ఉ॥ పాదము పెట్టి నవ్వుచు స
భా భవనాంగణసీమలోన నా
పాదిత కౌతుక ద్యుతులు
వక్త్రమునందుఁ దురంగలింప, భూ
మీాదయితుండు భక్తిని న
మింపఁగ దీవనఁజేసిఁ "నీ మనం
బేదియొ దాని కిప్పుడు గ
దే! సుముహూర్తము గూరె భూవరా!" 90

చ॥ హరిహరనాథదేవ కరు
ణామృత వృష్టిఁ దదీయ సన్నిధిన్
వఱలి కవిత్వముం బలుకు
భంగియుఁ దత్పదపద్మసేవమై
పరఁగుటఁజేసి నే బలుకు
వాఁడను భారత పంచమాగమం
బురువుగ నాంధ్ర వాఙ్మయ మ
హోదధి దివ్యదనర్ఘరత్నమున్॥ 91

మ॥ "హృదయాహ్లాది చతుర్థ మూర్జిత కథో
పేతంబు, నానాగసా
భ్యుదయోల్లాసి విరాటపర్వ మట యు
ద్యోగాదులం గూడఁగాఁ

బదియేనింటిఁ దెనుంగుబాస జనసం
ప్రార్థ్యంబులై పెంపునం
దుదిముట్టన్ రచియించెదన్ విబుధ సం
తోషంబు నిండారఁగా"॥ 92

ఉ॥ ప్రాయమువాఁడు, విద్దియల
బల్ నిపుణుండు, మనీషి, ధారణన్
వ్రాయఁగలాఁడు, నాపలుకు
భవ్యమహీంద్ర పత్ఝరీ ఝర
ప్రాయ కవిత్వధాటి సము
పాసన నాపక యాత్మఘంటమున్
వ్రాయఁ గలట్టిమేటి, గురు
నాథ కులాంబుధిలాబ్ధి సోముఁడే॥ 93

ఉ॥ పాయక పాకశాసనికిఁ
బద్మ విలోచనుఁ డట్లు, నన్నినా
రాయణభట్టు నన్నయ మ
హాకవిమౌళికిఁ బోలె సూరియున్
వ్రాయసగాఁడు నైన గురు
నాథ సుబ్రహ్మణి తోడు సూపుచున్
వ్రాయఁ దెనుంగుఁజేసెద న
వారిత భారత భవ్యభారతిన్॥ 94

గీ॥ హరిహరస్వామి నా స్వాంతమందు నిలిచి
భారతీమాత నాజిహ్వపై నటించి
తెలుఁగు భారత సంహిత దిద్ది తీర్చి
ఉభయకవి మిత్రు నన్నుఁ జేయుదురుగాక"॥ 95

ఉ॥ నావుడు హర్షమంది గురు
నాథుని వే గొనితేర బంటులన్
భూవరుఁ డంపె; వారు చని
భూపతి యానతి దెల్పి పల్లకీ
తోవడి వాని వైభవము
తోఁ గొనితెచ్చిరి గారవించి యే
వేవియొ యెన్నియెన్నియొ మ
హీశ్వరుఁ డాతని కిచ్చెకానుకల్॥ 96

శా॥ నీకన్నన్ వరలేఖకోత్తముఁడునున్
నిన్మించు ధీమంతుఁడున్
నీకున్ జోడు పరేంగితజ్ఞుఁడు నెటన్
లేఁడన్న విఖ్యాతినిన్
జేకొన్నాఁడవు నీవు, భారతము తె
న్గింపంగ నీ సాయమున్
గైకోనుంటిమి మేము యోగ్యతమునిం
గా నెన్నుటం బండితుల్॥ 97

ఆ॥వె॥ తిక్కయజ్వ పలుకు తెన్నున బడి తెన్గు
భారతంబు నీవు వ్రాయవలయు
జ్ఞాననేత్రమిచ్చి సాఁకిన మిమ్ములఁ
దెనుఁగువారు గొల్తు దేవతలఁగ॥ 98

మ॥ అనుచుం బల్కిన సిద్ధిరాజ హృదయా
యః పేటికాంతః ప్రదే
శ నిగూఢస్థ సువర్ణ కంకణ రుచుల్
చక్షుః ప్రియం బై యటం
గనుపింపన్ గురునాథుఁ డాత్మ ముఖ రా
కా శర్వరీ జ్యోతి యం
గణమెల్లన్ వెలిఁగింప సమ్మతిలి తి
క్కన్నన్ దమిం గాంచుచున్॥ 99

ఉ॥ "క్షత్రకులోద్భవుండు క్షితి
జాని, తదీయ మనః ప్రవృత్తియుం
బాత్రము; నీకు నాకు స్థిర
వాసము నీ భువిఁ గూర్పఁ, బద్ధ తా
పత్రయ మిద్ది; యీ తెలుఁగు
వారికిఁ దీరని లోటుఁ గూర్చి లో
కత్రయ మేలఁబోముగద!
కాని। సరే! యిఁకఁ బూను మిత్రమా! 100

గీ॥ ఉభయ కవులకు ము న్నొప్పుడో హితుండ
వనుచు త్వత్కృత రామాయ ణాఖ్య కృతియె
చెప్పె; మఱి యిప్పు డొక రేల చెప్పవలయు?
కడఁగు మనె నాంధ్ర భారతగ్రథనమునకు" 101

చ॥ నరపతి కోర్కె మేర కొక
నాఁడల తిక్కనసోమయాజి యా
హరిహరనాథు నాలయము
నందలి గర్భగృహంబులోన నా
హరిహరనాథ సన్నిధి హృ
దంబు రుహాంతరమందుఁ గల్పనం
బుసు వగు భక్తిఁ జేసికొని
యోగి తెఱంగున ధ్యాన మగ్నుఁడై॥ 102

కం॥ భవ! భవహర! దుర్భవవై
భవహర! నతభక్తలోక పరిపాలక! కే
శవ! భవుకంకర! త్రిపురా
హవవిజయా! గరుడవాహా! హరిహరనాథా! 103

కం॥ గిరిధర! గిరివర నిలయా!
గిరిజాహృదయాబ్జ భృంగ! గిరిరాజ నుతా!
హరివరద! హరి విభూషణ!
హరి శయనా! హరి విభంగ! హరి హరనాథా!॥ 104

శా॥ నిన్నే గొల్తుఁ, దలంతు నిన్నె మది, ని
న్నే భక్తి సేవించెదన్
నిన్నుంగూర్చియె యాడి పాడెదను, ని
న్నే మెప్పుఁ బూజించెదన్
నిన్నే పల్కెద, నీ కథల్ వినెదఁ, దం
డ్రి! ప్రోవవే నన్ను నీ
కన్నన్ వేరొక వేలుపున్ హరిహరే
శా! గొల్వఁగా లేనయా!॥ 105

శా॥ ఎన్నోజన్మము లెత్తియెత్తి కడ కే
నీ నాఁటికీ పుట్టువుం
గన్నాఁడన్, భవ మొల్ల నింకఁ, దరియం
గాఁజాల నీ వార్థి, నీ
కన్నన్ వేరొక మేఁటివేల్పు, గొన నా
కన్నన్ మరొక్కల్పుఁడిం
కన్నా! యియ్యల లేఁడుగా! హరిహరే
శా! నన్ గృపం బ్రోవవే॥ 106

సీ॥ (శ్రీ) పతిత్వంబును (శ్రీ)గళత్వంబును
నఖిల లోకావన యశముఁ జాట
రాజానుజతయును రాజశేఖరతయు
సుమనోభిమాని విశ్రుతియొనర్ప

హరిరాజ శాయిత హరిరాట్కలాపత
వరభక్త జనలోక వరదుఁజేయ
క్షితిభృదుద్ధారత క్షితిభృన్నివాసత
పుణ్యజనావనాప్తునిఁ బొనర్పఁ

గీ॥ బూతవై కుంఠకైలాసములను వీడి
కడఁక భూలోకగామివై కదలివచ్చి
సింహపురిలోనఁ గరుణ వేంచేసియున్న
హరిహరేశ్వర! నిన్నె నిత్యంబుఁగొల్తు॥ 107

సీ॥ తతమణీ ఫణ విరాజితుఁడైన ఫణిరాజు
పాన్పుగాఁ దొడవుగాఁ బరిఢవిల్ల
మునుఁగు భక్తుల పాపముల క్షాళనము సేయు
స్వర్గంగ చరణ మస్తముల వెలయఁ
బూతె జక్కవలకుఁ బుష్పవ న్నయనముల్
గనుఁగప్ప గనువిప్ప గలుగఁజేయ
విరహులఁ గవఁగూర్చు స్మరుఁడు కుమారుఁడై
విద్వేషియై కూర్మిఁ బెంపఁ దుంప

గీ॥ భజన మొనరించు తావక భక్తులందు
నొకరు "హరి" యన "హరుఁ" డంచు నొక రనంగ
హరిహరాత్మకతం బొల్చి యలరు నిన్నె
యహరహము భక్తిఁగొల్తు దేవాదిదేవ!॥ 108

కం॥ "భూరి భవ త్కారుణ్య
క్షీరాంబుధి నాదు తుచ్ఛ చిత్తమ్మున వి
స్తార మహితముగ నొనరిచి
తారయ నచ్చెరువుగాదె! యఖిలాండపతీ!॥" 109

ఉ॥ "ఇంతకు నేర్పు నీకు నొక
యింతటిలోన మదీయ వాణి న
త్యంత విభూతిఁ బెంపెసఁగు
నట్టి నినుం గొనియాడఁ జేత దా
నెంతటి పెద్ద? నీకరుణ
నిల్లు పదస్థుఁడ నైతి నింక జ
న్మాంతర దుఃఖముల్ దొలఁగు
నట్లుగఁ జేసి సుఖాత్ముఁ జేయవే"॥ 110

కం॥ అని నెమ్మది హరిహర నా
థుని రూపు రచించికొని యధో వదనుండై
ప్రణమిల్లి వినయ సంపద
పెనఁగొన మొల్లంపు భక్తి వినుతించి పయిన్॥ 111

ఉ॥ "ఇట్టి పదంబు గాంచి పర
మేశ్వరునిం గృతినాథుఁ జేసి యే
పట్టునఁ బుణ్యమూర్తి యగు
భారత సంహితఁ జెప్పఁ గంటి, నా

పుట్టు కృతార్థతం బొరసెఁ,
బుణ్య చరిత్రుఁడనైతి, నవ్విభుం
గట్టెదఁ బట్ట మప్రతిమ
కారుణికత్వ మహా విభూతికిన్" 112

ఉ। "కూర్పుట నూత్నరత్నమున
కుం గనకంబునకుం దగున్, జనా
భ్యర్చితమైన భారత మ
పార కృపాపగతంత్రి వృత్తిమైఁ
బేర్చిన దేవదేవునకుఁ
బ్రీతిగ నిచ్చుట సర్వసిద్ధి, నా
నేర్చిన భంగిఁ జెప్పి వర
ణీయుఁడ నయ్యెద భక్తకోటికిన్"॥ 113

ఉ॥ "కావున భారతామృతముఁ
గర్ణపుటంబుల నారఁగ్రోలి యాం
ధ్రావలి మోదముం బొరయు
నట్లుగ సాత్యవతేయ సంస్మృతి
శ్రీ విభవాస్పదం బయిన
చిత్తముతోడ మహా కవిత్వదీ
క్షావిధి నొంది పద్యముల
గద్యములన్ రచియింతు" నం చొగిన్॥114

చ॥ హరిహరనాథ భక్తుఁడు త
దాలయ పార్శ్వ సమీప మండపాం
తరమునఁ గూరుచుండి, పర
తత్త్వ విలీనత నంది, భక్తి త
త్పరత మహాంధ్ర భారత క
థా కథనాన కుపక్రమించుచున్
సురుచిరసూక్తిఁ బల్కఁ నగు
చున్ గురునాథుఁడు గంట మూనఁగా॥115

ఉ॥ "శ్రీయన గౌరినాఁ బరఁగు"
చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయిత మూర్తియై హరిహ
రం బగు రూపముఁ దాల్చి "విష్ణు రూ
పాయ నమ శ్శివాయ" యని
పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చ మెచ్చు పర
తత్త్వముఁ గొల్చెద నిష్ట సిద్ధికిన్॥ 116

## గద్య

ఇది శ్రీ భారద్వాజసగోత్ర, వెలిది గృహోపనామక, శేషమాంబా లింగమూర్తి పౌత్ర, కామేశ్వరీ రామమూర్తి దంపతీ గర్భశుక్తి ముక్తాఫల, సరస్వతీకరుణా కలిత సహజ కవితాలంకృత, మూర్తి కవి ప్రణీతంబయిన తిక్కన - మహాభారత రచనా కావ్యంబున సర్వంబును సంపూర్ణము.

# పోషకుల పట్టిక.

## మహారాజపోషకులు

| | |
|---|---|
| | రూ.న.పై. |
| శ్రీశ్రీ కవికులాలంకార, వాఙ్మయోద్ధారక, జవ్వాది లక్ష్మయ్యనాయుడు జమీందారుగారు, పెనుగొండ. | 116-00 |
| శ్రీ గుడిమెట్ల రామిరెడ్డిగారు, ల్యాండ్‌లార్డు, మల్లిపూడి. | 50-00 |
| శ్రీ తాడి సుగుణాఅదృష్టత్రిమూర్తిరెడ్డిగారు, M.A. నత్తా రామేశ్వరం. | 50-00 |

## రాజపోషకులు

| | |
|---|---|
| శ్రీ సత్తి శ్రీరామరెడ్డిగారు, బి. ఏ., నత్తారామేశ్వరం | 30-00 |
| హైస్కూలు స్టాఫ్, అత్తిలి, | 30-00 |
| పాదిల విశ్వనాథశర్మగారు, ల్యాండులార్డు, సోమరాజుఇల్లిందలపర్రు. | 25-00 |
| తుమ్మలపల్లి సత్యనారాయణమూర్తిగారు, బ్యాంకర్, పిప్పర. | 25-00 |

శ్రీ మద్దాలి రామకృష్ణారావుగారు, ల్యాండులార్డు, వీరవాసరం. 25-00
పొన్నలూరి కోటారెడ్డిగారు, Ex మునిసిపల్ చైర్మన్,
గూడూరు. 25-00
దాట్ల బలరామరాజుగారు, యం. పి. కవిటం. 25-00
తూములూరి వేంకట శివరామయ్యాపంతులుగారు, వకీలు,
నెల్లూరు. 20-00
ఆకుల పద్దయ్యనాయుడుగారు, ల్యాండ్ లార్డు,
కొత్తాలపర్రు. 20-00
కలిదిండి వెంకటాప్రమరాజుగారు, ల్యాండ్ లార్డు,
పెనుమంట్ర. 20-00
అనపల్లి సుబ్బరామరెడ్డిగారు, మైకామేనర్, గూడూరు. 15-00
మరుపూరు కోదండరామరెడ్డిగారు, ఎడిటర్,
మందాకినీ ప్రెస్, నెల్లూరు. 15-00
తుమ్మలపల్లి మంగరాజుగారు, బ్యాంకర్, భీమవరం. 15-00
మేడేపల్లి దేవరాజుగారు, పెనుమంట్ర. 15-00
తుంపూడి కృష్ణమూర్తిగారు, ల్యాండ్ లార్డు,
నత్తారామేశ్వరం. 15-00
మంత్రిరావు సత్యనారాయణరావుగారు, వకీలు, తణుకు. 15-00
దేవరకొండ సుబ్రహ్మణ్యంగారు, క్యాషియర్,
స్టేటు బ్యాంకు, మాట్రేరు. 15-00
కర్రి రత్నారెడ్డిగారు, నత్తారామేశ్వరం. 15-00
డా॥ జీడిగుంట రామచంద్రరావుగారు, పెనుమంట్ర. 15-00

## పోషకులు

| | |
|---|---|
| శ్రీ పి. వి. రమణారెడ్డిగారు, వకీలు, నెల్లూరు. | 10–00 |
| సిద్ధారెడ్డి వేంకట బాలకృష్ణారెడ్డిగారు, విలేజీ మునసబు, గూడూరు. | 10–00 |
| మల్లెమాల సుందరరామరెడ్డిగారు, ,, | 10–00 |
| అల్లాడి శ్యామసుందరరామరెడ్డిగారు, మైకామేనర్, గూడూరు. | 10–00 |
| పసుపులేటి సిద్ధయ్యనాయుడుగారు, మైకామేనర్, గూడూరు. | 10–00 |
| గుంటూరి శేషేంద్ర శర్మగారు, మునిసిపల్ కమీషనర్, గూడూరు. | 10–00 |
| అనంతవఝుల గోపాలరావుగారు, పాలి. | 10–00 |
| తాడి హనుమంతరెడ్డిగారు, Ex పంచాయితీ బోర్డు ప్రెసిడెంటు, నత్తారామేశ్వరం. | 10–00 |
| కొంపెల్ల గోపీవిశ్వనాధంగారు, రేలంగి. | 10–00 |
| గుడిమెట్ల చిన సత్తిరెడ్డిగారు, పం॥ ప్రె॥ మల్లిపూడి. | 10–00 |
| పాల వెంకన్నగారు, ఎడిటర్ శెట్టిబలిజ పత్రిక, నత్తారామేశ్వరం. | 10–00 |
| కరిరి సూరిరెడ్డిగారు, అర్జునుడుపాలెం. | 10–00 |
| తాడి కృష్ణారెడ్డిగారు, నత్తారామేశ్వరం. | 10–00 |
| పోతాప్రెగడ శ్రీరామారావుగారు, వకీలు, తణుకు. | 10–00 |
| కరిరి తాతారెడ్డిగారు, నత్తారామేశ్వరం. | 10–00 |

| | |
|---|---|
| శ్రీ వారణాశి వేంకట సుబ్బారావుగారు, ఊనగట్ల. | 10-00 |
| నల్లిమిల్లి విష్ణురెడ్డిగారు, వకీలు, ఏలూరు. | 10-00 |
| వీరవాసరం హైస్కూలు టీచరుస్టాఫ్, వీరవాసరం. | 10-00 |
| డి. సత్యలింగంపుడయార్ గారు, నత్తారామేశ్వరం. | 5-00 |
| నాగుబోయిన పాపయ్యగారు, ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, నత్తారామేశ్వరం. | 5-00 |
| వీరవల్లి వెంకట కనకరత్నంగారు, మాముడూరు. | 5-00 |
| దాట్ల వెంకట నరసింహరాజుగారు, పంచాయితీ సమితి ప్రెసిడెంటు, (అత్తిలిబ్లాక్) | 5-00 |
| సత్తి సత్తిరెడ్డిగారు, పెనుమంట్ర. | 5-00 |
| మోచర్ల రామకృష్ణయ్యగారు, వకీలు, నెల్లూరు. | 5-00 |
| యస్. బాలసుబ్రహ్మణ్యంగారు, వకీలు. ,, | 5-00 |
| దుర్భా రామమూర్తిగారు, వి. ఆర్. కాలేజీ లెక్చరర్, నెల్లూరు. | 5-00 |
| చతుర్వేదుల రామచంద్రయ్యగారు, ,, | 5-00 |
| కోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, వి. ఆర్. కాలేజి లెక్చరర్, నెల్లూరు. | 5-00 |
| పోలూరి హనుమజ్జానకి రామశర్మగారు, వి. ఆర్. కాలేజీ లెక్చరర్, నెల్లూరు. | 5-00 |
| డాక్టర్ సుంకర రామచంద్రరావుగారు, గూడూరు. | 5-00 |
| కాటంరెడ్డి గోపాలరెడ్డిగారు, మైకామేనర్, ,, | 5-00 |
| వ్యాడుమూడి నారాయణరాజుగారు, భట్లమగటూరు. | 5-00 |
| గోలభట్టు సుబ్బరాజుగారు, పం॥ ప్రె॥ ,, | 5-00 |

| | |
|---|---|
| శ్రీబలిజేపల్లి వెంకటా్రావుగారు, పం॥ ప్రె॥, రేలంగి | 5-00 |
| హైస్కూలు స్టాఫ్, పెనుగొండ. | 5-00 |
| హైస్కూలు స్టాఫ్, మార్టేరు. | 5-00 |
| టి. వి. యస్. శివరావుగారు, బ్రూక్ బాండు మేనేజర్, మార్టేరు. | 5-00 |
| కరిరి సుబ్బిరెడ్డిగారు, నత్తారామేశ్వరం | 25-00 |
| హారేరాం బాబాగారు. ,, | 20-00 |
| సత్తి సత్తిరెడ్డిగారు. ,, | 5-00 |
| సత్తి రామిరెడ్డిగారు, నత్తారామేశ్వరం | 2-00 |
| శ్రీమతి Ch. R. మాణిక్యాంబగారు. | 2-00 |
| శ్రీ దాట్ల సూర్యనారాయణరాజుగారు. | 5-00 |
| సూరంపూడి సుబ్బారావుగారు, నత్తారామేశ్వరం. | 5-00 |
| కరిరి వెంకటరత్నంగారు, పం॥ ప్రె॥ నత్తారామేశ్వరం. | 5-00 |
| కరిరి నాగిరెడ్డిగారు, ,, | 5-00 |
| ద్వారంపూడి చిన వీరిరెడ్డిగారు, ,, | 5-00 |
| సన్నిధి సూర్యనారాయణమూర్తిగారు, ,, | 5-00 |
| రమణం నాగన్నగారు, పెనుమంట్ర. | 5-00 |
| డా॥ కరటూరి సత్యనారాయణగారు, B. A., A. C. T. O. పెనుగొండ. | 5-00 |

# అభిమానులు

| | | |
|---|---|---|
| శ్రీ పోతంశెట్టి అచ్చిరెడ్డిగారు, | నత్తారామేశ్వరం. | 2–00 |
| తుంపూడి విశ్వరామంగారు, | ,, | 2–00 |
| కర్రి వెంకటరత్నంగారు, | ,, | 2–00 |
| కె. సత్యనారాయణరెడ్డిగారు, ప్రిన్సిపాల్, దుర్గా ట్యుటోరియల్ కాలేజీ, పెనుమంట్ర. | | 2–00 |
| కర్రి భీమిరెడ్డి భాగవతార్ గారు, | నత్తారామేశ్వరం. | 1–00 |
| కొప్ప్వారి గంగిరెడ్డిగారు, | ,, | 1–00 |
| కొప్ప్వారి వెంకటరెడ్డిగారు, | ,, | 1–00 |
| కొల్లేపర సీతారామయ్యగారు, | ,, | 1–00 |

## కైకరం గ్రామములో సమర్పించిన చందాల వివరములు

| | | |
|---|---|---|
| | | రు. న. పై. |
| శ్రీ పెద్దిరెడ్డి సత్యనారాయణరావుగారు, M.A., L.L.B. Land-Lord. | కైకరం. | 25–00 |
| మెగ్గిన వేణుగోపాల వెంకట రామారావుగారు, B.A., B.L. Land-Lord & Vice President, Co-operative Bank. | | 26–00 |
| శాసం సూర్య సోమశేఖరంగారు, Banker & Business | | 30–00 |

| | |
|---|---|
| శ్రీ చెన్నారెడ్డి వెంకటకృష్ణమూర్తిగారు, పంచాయితీ ప్రెసిడెంటు. | 15-00 |
| శ్రీమతి యెగ్గిన సీతమ్మగారు, కైకరం. | 4-00 |
| శ్రీ యెగ్గిన సూర్యచంద్ర సాధువరప్రసాదరావుగారు, Land-Lord. | 5-00 |
| జల్లా స్వామినాయుడుగారు, భూస్వాములు. | 1-00 |
| శ్రీవల్లీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి దేవస్థానంవారు. | 5-00 |
| శ్రీప్రక్కి విశ్వనాథశర్మగారు, B. Sc., B. Ed. హెడ్మాష్టరు, విద్యాభివర్ధనీ పరిషత్ హైస్కూలు. | 30-00 |
| ,, హైస్కూలు ఉపాధ్యాయవర్గము. | 43-00 |
| ,, ,, విద్యార్థివర్గము. | 50-35 |
| శ్రీ Ch. రాఘవేంద్రరావుగారు, V. L. W. | 2-00 |
| యెగ్గిన కేశవకృష్ణగారు, కైకరం. | 2-00 |
| శానం అచ్యుతరామారావుగారు, కైకరం. | 2-00 |
| శానం నాగరాజుగారు, ,, | 2-00 |
| పామర్తి భాస్కరరావుగారు, ,, | 2-00 |
| జల్లా భారత ప్రభాకరరావుగారు, ,, | 2-00 |
| డి. సత్యనారాయణగారు, State Bank. | 2-00 |
| కె. సత్యనారాయణరావుగారు, S. I. Ry. | 2-00 |
| వి. సంజీవరావుగారు, ,, | 2-00 |

—/—

# శిల్పాశ్రమము

సత్కళామయంగాను, శాస్త్రీయంగాను సమస్త దేవతా విగ్రహములు, సజీవంగా మహనీయుల విగ్రహములు, యిదియదననేల సర్వులకు వారివారి శక్త్యానుసారంగావలయు సర్వ విగ్రహములు, సిమ్మెంటు, దారు లోహాదులలో తయారుజేసి సకాలంలో సరసమైన రీతిని అందజేయుటలో మా శిల్పాశ్రమము కల్పతరువు. దయతో నొక్క పర్యాయము సందర్శించిన, మాశిల్పాశ్రమ విశిష్టత మీకే తెలియగలదు.

ప్రొప్రయిటరు:
దే॥ సత్యలింగము వుడయారు,
“శిల్పాశ్రమము”
నత్తారామేశ్వరం, పెనుమంట్ర. P.O.
పశ్చిమగోదావరి జిల్లా. (ఆంధ్ర ప్రదేశ్)

Sree Rama శ్రీ రా ము లు! Sree Rama

# నా యితర గ్రంథములు

1. "నీలాపనింద" ముద్రితము.

అ ము ద్రి త ము లు:

2. "కృష్ణరాయుని దక్షిణ దిగ్విజయం"
(1000 పద్యములు)

3. "సతీ సుముఖి" (400 పద్యములు)

4. "విశ్వనాథనాయక విజయం"
(400 పద్యములు)

5. "భారవి" (575 పద్యములు)

ప్రా ప్తి స్థా న ము:

వెలిది సత్యానారాయణమూర్తికవి,
నత్తారామేశ్వరము.
(వయా) పెనుమంట్ర, ప॥ గో॥ జిల్లా.



యు. యస్. ప్రింటింగు వర్క్సు, మారుటేరు.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA110B180 |
| పుస్తకం పేరు | 0<br>తెలుగున మహాభారత రచన |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 79 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, xiii B, 8, |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Haseena |
| పేజీలు విడదీసినది | Haseena |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |